ఈ ఆత్మకు ప్రత్యేక రూపంలేదు. చెట్టులనూ పుట్టలనూ ఇది ఆశ్రయించుకుని ఉంటుంది. ఒకప్పుడు పక్షిగానో, పాము గానో, పురుగుగానో ఉండవచ్చు. ఈనాటికీ మనం వేప చెట్టుకూ, రావిచెట్టుకూ ప్రదక్షణలు చెయ్యడం, పుట్టల్లో పాలు పొయ్యడం ఈ దశావశేషాలే. అప్పుడే జనించిన ప్రాణిని ఈ రకమైన ఆత్మశక్తి ఆకర్షించడానికి ప్రయత్నిస్తుందనీ, వీలయితే ఈ లోకంలో ఉంచకుండా పంపి ఆ ఆత్మను తనతో తీసుకుపోతుందనే భయం అప్పటి మనిషి మనస్సులో జనించడం సహజం. అందువల్ల పురిటి ఇంటి లోపలికి ఏ శక్తి ప్రవేశించడానికి వీలు లేని విధంగా, వాకిట ముళ్లకంప, పాత చెప్పులు, ఊదర మొదలైనవన్నీ ఉంచి పరిరక్షించే ఆచారం ఉత్పన్నమైంది. ఆ శక్తి పురుగు రూపంలో రావచ్చుననే కథ ఎన్నెమ్మ కథగా ప్రచారమైంది. అంతటితో తృప్తిలేక, దీనికి బాలగ్రహంగా స్థానం కల్పింపబడి, పురాణ కథల్లో సప్త మాతృకలతో అభేదం సాధించబడ్డది. ఇటువంటి శక్తుల్ని లొంగదీసుకునే రజ్జు తంత్రం (Chord Magic) - ఒకటి వాడుకలోకి వచ్చింది. పిల్లలకు తాయెత్తులు కట్టడం, ఒక పచ్చని తాడు కట్టి, దాన్ని విప్పి, వంటి మీద దిగదుడిచి, పచ్చని చెట్ల మీద వెయ్యడం మొదలైన ఇప్పటి ఆచారాలన్నీ ఒకనాటి సంఘంలో ఉన్న ఈ రజ్జు తంత్రం ప్రాధాన్యంవల్ల ఏర్పడినవే. జబ్బుగా ఉన్న వాళ్ల శరీరాలనుండి రోగాలను తరిమి వెయ్యడానికి, ఒక వ్యక్తిని మరో వ్యక్తికి లోబడేట్లు చెయ్యడానికి ఈ రజ్జు తంత్రం - ఉపయోగింపబడేది. ఇదే కొన్నిచోట్ల పెళ్లికూతురి నడుముకు బంధించే తాడుగానూ, మరికొన్నిచోట్ల మాలికగానూ, లేదా ఉంగరంగానూ, కని పిస్తుంది. మౌలికంగా ఇందులో నిక్షిప్తమైనది, స్త్రీని పురుషుడికి లొంగేటట్లుగా చేసే రజ్జు తంత్రమే. ఆత్మారాధన దశలోనే, ఆత్మ శక్తిని అదుపులో ఉంచుకోవడానికి, మంత్ర కలాపం, తాంత్రిక పద్ధతి (Magic & Sorcery) ఏర్పడ్డది. ఆత్మలను ఆకర్షించడం, ప్రీతుల్ని చెయ్యడం, శక్తిని తగ్గించడం, దూరంగా తరిమి కొట్టడం వంటి వన్నీ ఈ తాంత్రిక పద్ధతివల్ల సాధ్యమైనాయి. అంటే అప్పటికే ఆత్మలు రెండు రకాలుగా విభజింపబడ్డాయి. అందులో మొదటిది, తమకు మేలు చేసే తమ పూర్వీకుల ఆత్మలు. రెండవది కీడు చేసే పిశాచప్రాయాలైన ఆత్మలు. ఈ రెండవది ఆత్మారాధన దశలో నుండి ఉద్భవించిన పిశాచ రూపకల్పన (Demon-Cult); ఈ పిశాచ ప్రాయాలైన ఆత్మల్ని అదుపులో ఉంచు కోవడానికి మంత్ర చర్య తాంత్రికత, అవసరం కావలసి వచ్చింది. వాటి అవశేషాలే ఈనాటికి ఉన్న తాయెత్తులూ, విభూతి, రక్షరేకలు మొదలైన ఆచార విశేషాలు.

ఆత్మారాధన దశలోనే, ఒక వ్యక్తి మరణించగానే ఆశరీరం నుండి బయటికి పోయిన ఆత్మ తిరిగి తిరిగీ, తన పాత ఇంటికి రావాలని చూస్తుందనీ, తన వాళ్లతో సంబంధా లుంచుకుని వాళ్లకు ఇబ్బంది కలిగిస్తుందని ఆనాటి మానవుడు నమ్మాడు. అటువంటిది జరగకుండా కట్టుదిట్టాలు చేసుకునే వాడు. శవాన్ని రుద్రభూమికి తీసుకువెళ్లే దారిలో ఏడుచోట్ల దింపడంవల్ల, ఆ ప్రేతం, పరాకుపడి తన తొలి నివాసాన్ని కనుక్కోలేకపోయే ప్రమాదం ఉంది. ఖననం చేసేటప్పుడు. శవాన్ని బోర్లా ఉంచడంవల్ల, ఆత్మపైకి వచ్చే వీలులేకుండా పోతుంది. ఇల్లుపాడు పెట్టడంవల్లా, గోడలకు వివరాలు చేసి శవాన్ని తీసుకుపోవడం వల్లా, ఇంటిని ఆ ప్రేతం కనుక్కునే వీలులేకుండా పోతుంది ఈ విధంగా, ఈనాడు మనం పాటించే ఆచారాల వెనక ఒక నాటి మత పరమైన సాంఘిక చరిత్ర అవగతమౌతున్నది.

ఇక మనం పాటించే శకునాలను పరిశీలిస్తే అవి చాలా వరకు పిల్లి, పాము, బల్లి, నక్క, పాలపిట్ట, గూబ మొదలైన తిర్యక్కుల గమనం మీదా, అరుపుల మీదా, ఆధారపడి కనిపిస్తుంటాయి. ప్రాచీన మానవ సంఘ చరిత్రలో, జంతువులకు ప్రాధాన్యమిస్తూ వాటిని కులదైవాలుగా పూజించిన ప్రస్థానం ఒకటిఉంది. ఆ జంతువులు వంశ మూలకాలూ, విస్తర కారకాలున్నూ అయిన కుల దేవతలు. ఆ జంతువుల్లో ఆ వంశాల మూలశక్తి నిహితమై ఉంటుందని ప్రాచీన మానవుడు నమ్మేవాడు. అందువల్ల వాటిని పూజించడం వాటి పరంగా తనకు తాను కొన్ని ఆంక్షలు విధించుకోవడం చేసే వాడు. అటువంటి ఆంక్షలూ నియమాలూ కల్పించినవే ఈ శకునాలుగా నిర్ణయించవచ్చు. వీటివల్ల, జంతుపూజా ప్రాధాన్యం వహించిన ఒకనాటి సాంఘిక చరిత్ర అవగతం కాగలదు. ఈ రకంగా మనం ఈనాడు పాటించే మతాచారాల వెనకా, విధుల వెనకా ఎంతో ప్రాచీన సాంఘిక చరిత్ర దాగి ఉంది.

**సాంఘికాచారాలు**: సంఘంలో ప్రముఖంగా కనిపించే అంశం స్త్రీ పురుషుల మధ్య నెలకొనే సంబంధం. ఈ అంశం చుట్టూ అనాది నుండీ ఎన్నో ఆచారాలు అల్లుకొనిపోయి కనబడు తుంటాయి. ప్రాచీన మానవుడికి మూడవదశలో సాంఘిక వ్యవస్థతో పాటు కుటుంబ వ్యవస్థకూడా ఏర్పడ్డదని చెప్పవచ్చు. ఒక గుంపులో ఉన్న ఒక స్త్రీ ఆ గుంపుకు చెందిన పురుష

లందరి సొత్తు అనీ, అదే విధంగా పురుషుడు కూడా స్త్రీలందరి సొత్తు అనీ నిర్ణయించే ఆచారం అతి ప్రాథమికమైన ఆచారం. ఇది నిజానికి ఆటవిక దశలో ఏర్పడిన ఆచారమైనా దీని ప్రభావం మనిషి మోటుతనపు దశను దాటి నాగరకదశలో అడుగుపెట్టిన నాడు కూడా అతని జీవితంలో కనిపిస్తూనే ఉంది. అందుకు తార్కాణంగా ప్రాచీన కావ్యాలయిన రామాయణ భారతాల్లో ఎన్నో పాత్రల్ని చూపించవచ్చు. ఒక పురుషుడికి ఒక స్త్రీ, ఒక స్త్రీకి ఒకే పురుషుడు అనే సాంఘిక నియమం కట్టుదిట్టంగా ఆచరింప బడడానికి ముందు, ఒక స్త్రీకి ఎందరో పురుషులు, ఒక పురుషునికి ఎందరో స్త్రీలు అనే ద్రవస్థితిలో ఉన్న కుటుంబ వ్యవస్థ ఉండి ఉండాలి. ఆనాటి సాంఘిక న్యాయం అదే అనగా ఇప్పటి కుటుంబంలాంటి కుటుంబం ఏర్పడకముందు వాడుకలో ఉన్న ఆచార వ్యవహారాలవి. వీటివలన ఆనాటి సంఘ స్వరూపం తన్మూలంగా కుటుంబ జీవన పద్ధతి చక్కగా మనకు విదితం కాగలవు. భారతంలో ద్రౌపది పాత్ర, ఉద్దాలకుని భార్య పాత్ర, మాధవి పాత్ర, రామాయణంలో తార పాత్ర ఈ ఆచారానికి చక్కని తార్కాణాలు.

రామాయణంలో దశరథునికి మూడువందల పైచిలుకు భార్యలు. భారతంలో ధృతరాష్ట్రుడు కూడా బహు భార్యకుడే. అన్న భార్య మమతను తమ్ముడు బృహస్పతి ఆశించి ఆవిణ్ణి బలాత్కరించి పొందగలిగాడు. ఇవన్నీ ఆనాటి సాంఘిక న్యాయాలు. ఇప్పటి కుటుంబంలాంటి కుటుంబం ఏర్పడక ముందు నెలకొని ఉన్న సాంఘికాచారాలు.

ఇట్లా సంఘ వ్యవస్థ ఏర్పడుతున్న తొలికాలంలో అన్నదమ్ముడూ అప్పచెల్లెలు - భార్యా భర్తలుగా ఉండడం తప్పు కాదు. మనకు పురాణాల్లో కనిపించే యమ యమీ వివాహకథ వంటిదిందుకు తార్కాణం. బైబిల్‌లోని ఆదామ్ అవ్వలు తోబుట్టువులు. ప్రాచీన గ్రీకుగాథల్లో కూడా ఇటువంటి కథలు లెక్కలేనన్ని.

ఒక వ్యక్తికి, చుట్టూ ఉన్న బంధువులతో ఎన్నో రకాల బంధుత్వాలు కల్పింపవచ్చు. మొదటి దశలో, ఒక వ్యక్తి అన్నలు, తమ్ములు, పినతండ్రి, పెదతండ్రి కొడుకులు, మేనత్త మేనమామ కొడుకులు. అందరూ ఒక తరం వారన్న కారణం చేత వీరందరూ అన్నదమ్ములుగా భావింపబడేవారు. అదే విధంగా, అక్కలు, చెల్లెళ్లు, పినతండ్రి, పెదతండ్రి కూతుళ్లు, మేనత్త మేనమామ కూతుళ్లూ అప్పచెల్లెళ్లుగా భావింప బడేవారు. వీరందరూ రక్త సంబంధం కలవారు కావడంచేత, పరస్పర వివాహ యోగ్యులుగా ఆమోదింపబడే వారు. అనగా రక్త సంబంధం కలిగిన ఏ స్త్రీ పురుషుడైనా ఒక తరానికి చెందిన వారైతే వారు వివాహ మాడవచ్చు. ఈ సాంఘిక న్యాయం మనకు ఎబ్బెట్టుగా కనిపించవచ్చు. కాని ఇది ఒకనాటి ఆచారం. దీనినుండి ఉద్భవించి మనకు ఇప్పటికీ ఆమోద యోగ్యంగా కనిపించేదే, మనం గౌరవిస్తున్న మేనరికం. మేనరికంలో మనం ఒక తరానికి చెందిన అప్పచెల్లెళ్ల బిడ్డలతో అన్న దమ్ముల బిడ్డలను వివాహ యోగ్యులుగా అంగీకరిస్తున్నాము. కాని అన్నదమ్ముల బిడ్డల మధ్యా, అలాగే అప్పచెల్లెళ్ళ బిడ్డల మధ్యా ఈ సంబంధాన్ని ఊహించనైనా లేము, అది మహాపాపం. ప్రాచీనాచారంలో ఒక భాగం, ఈనాటికి, ఒక సంఘంలో అంగీకార యోగ్యమైన ఆచారంగా మారింది. ఇక్కడ ఒక సంఘం అని ప్రత్యేకించడానికి కారణం ఉంది. ఇదే ప్రాచీనాచారం వల్ల నొమాడిక్ జాతులలో అన్నదమ్ముల బిడ్డల మధ్య వివాహం అంగీకార యోగ్యం. అలాగే అప్పచెల్లెళ్ల బిడ్డల మధ్య కూడా. కాని మనకు అంగీకారమైన మేనరికం, వాళ్లకు చాలా తప్పు. ఆ సంఘంలో ఆచారం మన సాంఘికాచారం కంటే భిన్నంగా ఉంది. అయినా రెండూ ఒక ప్రాచీన సాంఘికాచారం యొక్క రెండు భాగాలుగా మనం సులువుగా గుర్తింపవచ్చు.

రానురాను ప్రాచీన సాంఘిక వ్యవస్థలో చాలా మార్పులు రావడం కనిపిస్తుంది. అప్పచెల్లెల్లూ, అన్నదమ్ముళ్లూ ఒకే బిడ్డకు తల్లిదండ్రులు కావడానికి వీలు లేదనే నిర్ణయం వచ్చింది. అంతేకాక రక్త సంబంధం కలవారు, లేదా ఒకే గోత్రం కలవారు పరస్పర వివాహ యోగ్యులు కారన్న నియమం పటిష్టం కావొచ్చింది. ఈనాటికీ ఉత్తర హిందు స్థానంలో మేనరికం దూష్యం. రక్త సంబంధం కలిగిన వివాహాలు ఆమోదయోగ్యాలు కావు. మనలో కూడా సగోత్ర వివాహాలు కానీ, ఒకే ఇంటిపేరు కలవారి మధ్య వివాహాలు కానీ దూష్యాలు.

మరో ఉదాహరణను గ్రహిద్దాం : హైందవులందరూ బొట్టుకు ప్రాధాన్యమిస్తున్నారు. అది రక్త వర్ణశోభితమై, స్త్రీలు విధిగా ధరించవలసిన చిహ్నమై, ఆచారాలలో, స్థిరపడ్డది. దీని వెనుక ఉన్న సాంఘిక సత్యం ఏమిటి ? రక్తవర్ణంతో కూడిన ఈ చిహ్నం రక్తానికి ప్రతీక. రక్తంలో ఆత్మశక్తి నిహితమైఉంటుంది. అది జీవ లక్షణానికి కూడా ప్రతీక. స్త్రీలకు సంబంధించిన రజోరక్తం సఫలతకు

(Fertility) ప్రతీక. స్త్రీ నుదుట కుంకుమ గుర్తు ఆవిడకు గల సంతానోత్పత్తి శక్తిని సూచిస్తుంది. అది కన్య నుదుట ఉన్నా, వివాహిత నుదుట ఉన్నా, ఆవిడకు గల సఫలతా శక్తిని వెల్లడి చేయడానికి మాత్రమే. అందువలననే హైందవ సమాజంలో విధవలకు, అనగా వివాహ యోగ్యత లేదని శాస్త్రాలు నిషేధించిన స్త్రీలకు, ఈ చిహ్నాన్ని ధరించే అర్హతలేదు. అనగా వారికి సంతానవతులయ్యే అవకాశం లేదని ఖచ్చితంగా చెప్పడం జరిగింది. ఈ కుంకుమను, నుదుట ధరించినా పాపిటలో చేర్చినా ఆంతర్యం ఒకటే. రానురాను, కుంకుమ ఏ రంగులోనైనా ఉండే అలంకార వస్తువుగా రూపు చెందింది. అయినా అది వెనుకటి ప్రతిపత్తిని బట్టి యిప్పటికీ సౌభాగ్య చిహ్నమే.

ఇట్లా ఈనాటి సాంఘిక వ్యవస్థలలో స్థిరపడ్డకొన్ని ఆచారాలు ప్రాచీన కాలంలోని ఏ సాంఘిక న్యాయాన్ని బట్టి రూపు చెందాయో వివరించవచ్చు.

ఆర్థికపరమైన ఆచారాలు : ఆయా ఋతువుల్ని బట్టి వచ్చే పంటను వినియోగించుకోవడంతో మనలో ఓ ఆచారం ఉంటుంది. ఉదాహరణకు సంక్రాంతి సమయాన ఇంటికి చేరిన కొత్త బియ్యంతో, కొత్తగా అప్పుడే వచ్చిన బెల్లం కలిపి పొంగలి దేవుడికి పెట్టి, తర్వాత వాటిని వినియోగించడం. అట్లాగే స్త్రీలు వేసవిలో మామిడి పళ్లు, మల్లెపూలు తొలిసారి ఉపయోగించ బోయే ముందు ముత్తయిదువుల్ని పిలిచి వారికిచ్చిగాని వాటిని అనుభవించకుండా ఉండడం.

ఇటువంటిదే పార్వతీపురం ప్రాంతంలో ఉన్న గిరిజనుల సాంఘికాచారాలతో సరిపోలుతుంది. ఈ గిరిజనులు తెలుగువారే. ఈ ప్రాంతాలలో ద్రావిడ కుటుంబానికి చెందిన కొండభాష మాట్లాడే వారు కూడా ఉన్నారు. వీళ్లలో, కంది గాని, కొణ్ణంగి (వరి) గాని, ఇప్పపూలు గాని, మామిడిగాని, తొలి పంటను పండగ చేసుకోందే ఎవరూ అనుభవించకూడదు. అట్లాచేస్తే వాళ్ల పశువుల్ని చిరతపులులెత్తుకు పోతాయని నమ్మకం ఉంది. ఎవడికి వాడు అందింది దొరకబుచ్చుకోకుండా, అందరూ సమానంగా అనుభవించే అవకాశాన్ని ఈ పండగలు కల్పించేవి. వీళ్ల సాంఘికచరిత్రలో పండగకు పర్యాయపదం 'కొత్త' – కందికొత్త, కొణ్ణంగి కొత్త, మామిడి కొత్త, ఇప్పకొత్త అనేవి వీళ్ల పండుగలు.

వెనక రోజుల్లో ఈ పంటలేవీ వీళ్లు సేద్యం చేసి సాధించేవిగా లేవు. ప్రకృతి సిద్ధంగా ఫలించే ఈ పంటల్ని నలుగురికీ తెలివిడి అయ్యే అవకాశాన్ని కల్పించుకుని అందరూ కలిసి అనుభవించే వీలును కల్పించుకోవడంలో ఆర్థికదృష్టి కనిపిస్తుంది. అటు వంటిదే మనలో మరో ఆచారం ఉంది. బయట ఎక్కడైనా గుమ్మడి పాదుకు కాయలుంటే, వాటిని ఎవరూ కోసుకుని ఇంటికి తీసుకుపోగూడదు. అవి యెవరికి చెందుతాయో వారే అనుభవించాలి. వాటికి చుట్టూ మనుగులు లేకపోయినా, రక్షణ లేకపోయినా వాటినెవరూ తస్కరించకూడదు. దీనికి విఘాతం కలిగించిన వాడికి దరిద్రం చుట్టుకుంటుందని ఒక నమ్మకం ఉంది. ఇక్కడా ఆర్థిక కారణమే. దీనికి ప్రత్యామ్నాయంగా, కాయలు తస్కరించేవాడు తీగె దగ్గర పదో, అయిదో పైసలు విడిచి పోవడం కద్దు. ఈ చర్య వాణ్ణి హక్కుదారులుగా చేస్తుంది గాని, దొంగను చేయదు.

రాజకీయపరమైన ఆచారాలు : దైవపూజ చేసేటప్పుడు శుభకార్యాలు నిర్వహించేటప్పుడు, వ్రతాదికాలు జరిపేటప్పుడు గణపతి పూజచేసే ఆచారం అందరిలోనూ ఉంది. గణపతిని విఘ్ననాశకుడు అనడం కంటే విఘ్న కారకుడు అనడమే మొదట మొదట పటిష్ఠంగా మనకు కనిపిస్తుంది. భక్తులు ఆయన్ని విఘ్నరాజు అని స్తుతించి, విఘ్నాలు కలిగించకుండా కాపాడమని ప్రార్థించేవారు. ఈ దేవుడి ఆకారాన్ని విశ్లేషిస్తే, ఏదో ఒక ఆటవిక సమూహానికి, ఇతడు నాయకుడుగా కనిపిస్తాడు. చేతిలో ఉండే పాశాంకుశాలు, ఏనుగుల వేటకుపయోగించే సాధనాలు. ఏనుగు తల ఈ దేవుడికి తలగా ఏర్పడడం ఈ ఆటవిక నాయకుడి గుంపు చిహ్నం 'ఏనుగు' అనే విషయాన్ని నిర్ధారిస్తుంది. ఈ రకంగా గుంపులకు నాయకులుగా తయారైన ఆటవికులు, ఆర్య సమాజం దృష్టిలో చులకన అవడం సహజమే. కాని ఒక కాలాన మిక్కిలి పటిష్ఠమైన రాజకీయ స్థానాన్ని ఆక్రమించిన గణపతిని సమకాలీన సంఘం నిరసించే వీలు కుదరలేదు. నిర్లక్ష్యం చేయడానికి కూడా వీలులేని ఈ గుంపు నాయకుడు ఆర్యదేవతా చక్రంలో స్థానాన్ని బలవంతగానే ఒడిసి పుచ్చుకోవడం సంభవించింది. అందుకే భక్తుల పూజకు సంబంధించిన ఆచారాలలో ఈ దేవుడికి తొలి పూజ లభించడం, ఈయన్ని విఘ్నరాజు అని కొలవడం స్థిరీకరింపబడింది.

ఇట్లా ఎన్నో రకాలైన ఉదాహరణలను చూపిస్తూ గతకాలపు మత, సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులు ఆచారాల రూపంలో సంక్షిప్తీకరింపబడి ఈనాటికీ మన మధ్య బ్రతికే ఉన్నాయని నిర్ధారించవచ్చు.

నేటి ఆచారాలను పరిశీలించి, అవి యిచ్చే సూచనల వల్ల, పొరపాట్లు రాని విధంగా, ప్రాచీన సాంఘిక చరిత్రను నిర్మించుకోవలసి ఉంది.

ఇంత విపులమైన చర్చ అనంతరం, మనం ఈనాడు అర్ధరహితంగా భావిస్తూ కూడా, ఆచరించడం మానని ఎన్నో ఆచారాల వెనకా, విధుల మాటున, ఒకనాటి సాంఘిక స్వరూపం దాగి ఉంటుందనీ, దానికి నిశ్చితమైన రూపాన్ని ఇవ్వడానికి మనం మన ఆచార వ్యవహారాలను కూడా పరిశీలన విషయాలుగా, గ్రహించవలసి ఉంటుందనీ నిర్ణయించ వచ్చును.

* * *



# జానపద కళలు

ఎల్లోరా

ప్రజల మధ్యనే స్వతస్సిద్ధంగా పుట్టి ప్రవర్ధమాన మయిన కళారూపాలు అవడంవల్లనే వాటికి జానపద కళా రూపాలని పేరు వచ్చింది.

ఈ జానపద కళారూపాలు జాతి జీవితంలో బహుళ ప్రచారం, ఆదరణా పొందాయి.

జానపద కళారూపాలు జాతి జీవనంలో సామాజిక పరంగా, సాంస్కృతిక పరంగా పెనవేసుకుని ఉండడంచేత దేశంలో సమాజంలో రాజకీయ, సాంఘిక పరిణామాలు ఎన్ని వచ్చినా అనూచానంగా వస్తున్న ఈ కళారూపాలు చెక్కు-చెదరకుండా అలానే నిలచిఉన్నాయి.

మన ప్రాచీన కళారూపాలైన కురవంజి, యక్షగానం, తోలుబొమ్మలాటలు, కలాపం, బుర్రకథ, హరికథ, వీధి నాటకం, చోడిగాడు, భాగవత మేళం, పగటి వేషాలు, వాలకం, రుంజలు (జానపద గాయకాలు), భజనలు, పిచ్చుకుంటలు, దాసర్లు, చిందుమాదిగలు, బైండ్లు, కాటికాపర్లు, కాశీ కావళ్లు, జంతరుపెట్టె, గంటి భాగోతులు, విప్ర వినోదులు, సాధనా శూరులు - ఇలా మరెన్నో వున్నాయి. వీటన్నిటిని జానపద కళారూపాలనే అంటాము.

ఇవన్నీ ఇప్పుడు ఉన్నాయా అని ప్రశ్నించుకొంటే — కాల ప్రభావంలో కొన్ని కొన్ని కాలగర్భంలో కలిసిపోయి ఉండవచ్చు. కాని చాలామట్టుకు పల్లెల్లో ఉన్నాయి. పల్లె జనాళిని అలరిస్తూనూ ఉన్నాయి.

జానపద కళారూపాలు అనేవి ఒక్క మనకే పరిమిత మైనవి కావు. ఇవి, అంటే జానపద కళారూపాలు ఏ దేశంలో, ఏ ప్రాంతంలో ఉన్నా, ఏ వేషభాషల్లోఉన్నా అక్కడి ప్రజల ఆశలకూ ఆశయాలకూ, ఆలోచనా సరళికీ ప్రతిరూపాలు గానే చెప్పుకోవలసి ఉంటుంది. ఇటువంటి ప్రత్యేకతలను కలిగి ఉన్నాయి గాబట్టే ఈ కళారూపాలు ప్రజలను ఆకట్టుకోడం జరుగుతూంది.

వీటిని - ఇలా విభాగించుకోవచ్చును : 1. స్వాభావిక రూపాలు, 2. వృత్తి సంబంధీక రూపాలు, 3. వ్యంగ్య రూపాలు, 4. మిశ్రమాలు.

## యక్షగాన ప్రబంధాలు

"సర్వశాస్త్రార్థ సంపన్నం సర్వశిల్ప ప్రదర్శనమ్
నాట్యసంజ్ఞమియం వేదరీతేసి హాసం కరోమ్యహమ్

ఏవం సంకల్ప్య భగవాన్సర్వాన్వే దానను స్మరన్
నాట్యవేదం తపశ్చ క్రేచతురేదాజ్ఞ సంభవమ్
జగ్రాహ పాఠ్యమృగ్వేదాత్సా మభ్యోజీత మేవచ
యజుర్వేదా దభినయా న్రసానా థర్వణాదతి
వేదోపవేద సంబంద్ధో నాట్యవేదో మహాత్మనా
ఏతింఛగవతా సృష్టో బ్రహ్మణా లలితాత్మనా
ఉత్పాద్యనాట్య వేదంతు బ్రహ్మోవాచ సురేశ్వరమ్"

ఋగ్వేదంనుంచి వాచకాన్నీ, యజుర్వేదంనుంచి అభినయాన్నీ, అథర్వణ వేదంనుంచి రసాన్నీ, సామవేదంనుంచి సంగీతాన్నీ గ్రహించిన బ్రహ్మ నాట్యవేదమనే పంచమ వేదాన్ని ప్రవచించినట్లు భరతముని చెప్పి ఉన్నాడు. అంటే వేదాలలోనే రూపక బీజాలున్నవన్నది మనకు బోధ పడుతుంది.

వీధి నాటకాలకు చాలా వయసు ఉన్నట్లుగా హాల శాత వాహనుడు రచించిన గాథా సప్తశతి మనకు చెబుతూనే ఉంది. సుమారు రెండువేల ఏళ్ళకు పూర్వమే వీధి నాటక లక్షణాలు, దేశి వాద్య విశేషాలు ఉన్నట్లు - నాటి శిల్ప ప్రతికృతుల రూపావశేషాల ద్వారా మనం గుర్తించవలసి ఉంటుంది.

వాల్మీకి రామాయణంలో శ్రీరామచంద్రుని జనన వర్ణన చూడగా, దేశి సారస్వతంగా ప్రచారం పొందిన జానపద రచనలు ప్రచారంలో ఉండి ఉన్నట్లు బోధపడుతుంది.

గంధర్వుల మధురగానం, అప్సరసల నాట్యం, దేవతల దుందుభి వాద్యము, వీధులలో నటీనటుల నాట్య ప్రదర్శనలు, సూత, మాగధ వంది జనుల వాద్యాలను గురించీ వర్ణించ బడింది.

నన్నయ కాలానికి నాటకాదులు ప్రచారంలో ఉన్నా యనడానికి —

"...ఉదాత్త రసాన్విత కావ్య నాటక క్రమములు బెక్కు సూజితి" అన్న పద్యంద్వారా బోధపడుతూంది. రెండు వేల ఏళ్ళనాడే ప్రచారంలో ఉండిఉన్నట్లు భాగవతంలో కృష్ణుని జన్మ సమయంలో గోపికలు ఈ తరహా పాటలనే పాడినట్లు దశమస్కంధంలో వర్ణించబడిందికూడా. అంతటి ప్రాచీనమైన దేశి సారస్వత శాఖలో సంగీత రూపక ప్రధాన మయిన యక్షగానాలను పరిశీలిద్దాం.

యక్షగానం అనగా దేశీయ ఛందోబద్ధమయిన నాటకము. దీనినే పాటగా కూడా పేర్కొనక పోలేదు. యక్షగానాల గురించి త్రౌణ్య నిఘంటువులో పాటగా పేర్కొనబడింది. అయితే అప్పకవి దృష్టిలో యక్షగానం పాటలుగల ప్రబంధం అయివుండవచ్చునని తోస్తుంది. ఎందుచేతనంటే అప్పకవీయంలో యక్షగాన ప్రశస్తి ఉంది. అందులో అర్థచంద్రికలూ, త్రిపుట, జంపె, ఆటతాళము 'వీన యక్షగాన ప్రబంధంబులతుకవచ్చు' అని పేర్కొన్నాడు.

శ్రీనాథుని కాలంలో ఇవి చాలా ప్రచారంలో ఉండి ఉన్నట్లు "కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు గాంధర్వమున యక్షగాన సరణి" అన్న దానినిబట్టి తెలుస్తూంది

ఈ యక్షగానాలు తెలుగులో సుమారు 400 దాకా ఉన్నట్లూ, మిగిలినవి అముద్రితాలనీ చారిత్రక పరిశోధకుల అంచనా.

ఈ యక్షగానాలకు వసంతఋతువు తంజావూరు రాజుల కాలంలో. ఆ కాలంలో స్త్రీలుకూడా వేషాలు ధరించడం ఉండేది.

తెలుగునాడున వీధి నాటకాలు ఉన్నట్లుగానే తమిళ దేశంలో "తెరుక్కుత్తు" లనీ కన్నడంలో "బయలాటము" లనీ వ్యవహారంలో ఉన్నాయి.

ద్రవిడ భాషయందు మొట్టమొదట కురవంజి అనే దృశ్య రచనలు బయలుదేరినవి. ఈ కురవలు ఆటవికులు. వీరికి అడుగువేస్తూ నృత్యం చేయడం అలవాటు.

అయితే యక్షగానాలలో గేయానికి ప్రాధాన్యం ఉంటే, కురవంజిలో నృత్యానికి ప్రాధాన్యం.

ఈ యక్షగాన ప్రదర్శనము ఏ రూపంలో ఉంటుందో చూడండి.

"...ఢక్క హుడక్క ఝర్ఝరల్
ఝల్లరి యాదిగా గలుగు శబ్ద
పరంపర తాళబద్ధమై
యుల్లసిలం ప్రబంధముల
కొప్పగ నాడుదు రగ్రవేదిపై"

బసవ పురాణంలో పాల్కురికి యక్షగాన ప్రదర్శనల రూపం ఇలా ఉందన్నాడు.

"...పాటలుగాగట్టి పాడెదువారు, ప్రస్తుతోక్తుల గద్య పద్య కావ్యముల విస్తారముగ జేసి వినుతించువారు, నటుగాక సాంగభాషాంగ క్రియాంగ పటు నాటకంబుల నటించువారు"

ఈ యక్షగానాలలో చాలా హాస్య ప్రధానమయిన సాంప్రదాయిక పాత్రలు ఉన్నాయి. ప్రతి యక్షగానంలోనూ

అందలి ఇతివృత్తం వేరు అయినా హాస్య పాత్రలు ప్రతి దానిలోనూ ఉంటాయి. ఈ పాత్రలన్నీకూడా హాస్యం కోసం ఉద్దేశించబడినవే.

మన పరిశోధకుల నిర్ణయాలనుబట్టి చూస్తే - చెన్నసౌరి శౌభరి చరితమే మొదటి యక్షగాన రచనగా తెలియవస్తూంది. ఇది క్రీ॥ శ॥ 15వ శతాబ్ది ఉత్తరార్థం లోనిదని అంచనా. అయితే మనకు లభ్యమయిన యక్షగానాలలో - కవి కాలం తెలిసినంతమట్టుకు కందుకూరి రుద్రకవి సుగ్రీవ విజయమే ప్రాచీనమైనదిగా పరిగణించబడుతూ ఉంది.

యక్షగానాన్ని దేశి రచనగానే పరిగణిస్తూన్నారు.

సంస్కృతంలో విదూషకుని పాత్రే పాశ్చాత్య దేశాల లోని కోర్టుఫూల్, కోర్టు జెస్టర్, బఫూన్‌లు. వీరికి సరిపోలినవే తోలుబొమ్మలలో జుట్టు పోలిగాడు, గాంధోలిగాడు, బంగారక్క; యక్షగానాలలో కోణంగి; కురవంజిలో సింగి, సింగడు.

అలాగే మాధవి పాత్ర కూచిపూడివారి సృష్టి. ప్రతి భామాకలాపంలోనూ ఇతడు మనకు ప్రత్యక్షమౌతాడు. విదూషకునిలాగ హాస్య ప్రసంగాలూ, కథనూ నడిపిస్తాడు. మాధవి పాత్రను సింహళ రూపకంలోని 'తోరాతరు కథా కారయ', బర్మావారి నాటకంలోని 'లూ - బయట్'—లతో పోల్చుకోవచ్చును.

వేషాలు వేసుకుని, పాడుతూ ప్రదర్శించే రూపకమే యక్షగానం.

జానపద కళారూపాలు - ప్రాంతానికో విధంగా ఉండి ప్రచారం అయినవి కొన్ని, రాష్ట్రానికంతటికీ కాస్త ఇటూ అటూలో ప్రచారం పొందినవి, మండలాలలో ఆ యా ప్రజల భాషలో ప్రాచుర్యం పొందినవి - ఇలా ఎన్నో ఉన్నాయి.

తెలంగాణం ప్రాంతంలో కొన్ని కళారూపాలకు మంచి ప్రాచుర్యం ఉంది. అలాగే విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం ప్రాంతాలలో కొన్నింటికి ప్రచారం ఉంది.

బుర్రకథ, తోలుబొమ్మలు, వీధి నాటకాలు, కలాపాలు వంటివి దేశం మొత్తంమీదనే ప్రచారం, ఆదరణ పొందాయి.

జానపద కళారూపాలు - యక్షగానం, కురవంజి, హరి కథలు, ఒగ్గుకథ, చెక్కభజనలు, బుర్రకథలు, కలాపాలు, పగటి వేషాలు, గిరిజన నృత్యాలు, పిచ్చుగుంట్లు - ఇలా మరెన్నో.

జానపద గాయకులు - రంజవారు, వీరన్నలవారు, వీర ముష్టివారు, బనికలవారు, జంగములు, పిచ్చుక గుంట్లవారు, దాసరులు, శారదకాండ్రు మొదలయినవారు.

వీరు అనేక విధములయిన వాద్య విశేషములతో ఊరూరా తిరుగుతూ వాద్యాలను వినిపిస్తూ, పాటలు పాడు తూంటారు.

జానపద వాద్య విశేషాలు : - వీరణములు, గుమ్మెట, ఒగ్గులు, కోలలు, శంఖము, శారద, అందెలు, కటివాద్యము, డప్పు, తప్పెట, తాళాలు, తంబుర, జమిడికలు, చిరుతలు, నాగస్వరము, గజ్జెలు, ఢిక్కి పిల్లనగ్రోవి, కొమ్ము బూరలు, బుర్రలు, రుంజ మొదలయినవి.

వీరు పాడే పాటల్లో, చెప్పే కథల్లో చారిత్రక, పౌరాణిక, పారమార్థిక ఇతివృత్తాలు ప్రధానాలు.

## పగటి వేషాలు

ప్రత్యేకంగా పగటిపూట ప్రదర్శించే వేషాలు కావడం వల్ల వీటికి "పగటి వేషాలు" అని నామకరణం వచ్చింది.

ప్రజా వినోదం ప్రధాన ఆశయంగా, ప్రజల ఆశలకూ, ఆశయాలకూ దర్పణంగా ఇవి దేశంలో ప్రచారం పొందాయి.

వీటిని గురించి అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి.

నాటి పరిపాలకుల దృష్టికి ప్రజా సమస్యలను తీసుకు రావడం, వర్తమానాలను చేరవేయడం కొరకు ప్రధానంగా ఈ ప్రదర్శనలు ప్రచారంలోకి వచ్చాయని ప్రతీతి.

కృష్ణా జిల్లా కూచిపూడి, పగటి వేషధారులకు నిలయం. నృత్య నాటకాలు ఆడేవారు నాట్య మేళములుగా ఏర్పడి తమ కున్న కళా ఔన్నత్యంతో ప్రదర్శనలూ ఇస్తున్నారు.

కూచిపూడి వారిలో కొందరు సంవత్సరంలో కొన్ని నెలలు సంచార మేళములుగా ఏర్పడి ప్రజలలో విజ్ఞాన ప్రబోధం చేస్తూ - తద్వారా ఆనందాన్నీ, ఆలోచననూ కలిగి స్తూంటారు.

అయితే ఇక్కడ మనం ఒక విషయాన్ని మరచిపో కూడదు. కూచిపూడి - భాగవత కథా ప్రదర్శనలకు ప్రత్యేకత అయితే, గడ్డిపాడు - పగటి వేషాలకు ప్రసిద్ధిపొందింది - అసలు పగటి వేషాలకు ఒక విలువను చేకూర్చిన వారు గడ్డిపాడువారే అనిపిస్తుంది.

గడ్డిపాడువారు సుమారు 60 రకాల వేషాలను ప్రదర్శించేవారు.

ఈ వేషాలలో నిత్యజీవితంలో ఉండేవి కొన్ని, పౌరాణికంగా కొన్ని, కల్పిత వేషాలు కొన్ని, పూర్తిగా హాస్య ప్రధానమైనవి కొన్ని. వీరి వేషాలలో ఉండే గొప్పతనం నమ్మించడం. అంటే గొర్రెలుకాచే గొర్రెల కాపరి వేషం ధరిస్తే అక్షరాలా అలాగే ఉండడం.

కూచిపూడి వారైనా, గడ్డిపాడు వారైనా - దేశంలో ఉన్న మతాలనూ కులాలనూ, మాండలిక భాషనూ ఆకళింపు చేసుకొనడంలో వీరికి వీరేసాటి.

పగటి వేషాలద్వారా – రాజులలో మార్పును తేవడం, ప్రజల్లో చైతన్యాన్ని కలిగించడం ప్రత్యేకించి ఉదహరించ వలసి ఉంటుంది. కాకతీయ యుగంలో యుగంధరుడు పిచ్చి యుగంధరుడుగా నటించి 'ఢిల్లీ సుల్తాన్ పట్టుకపోతాన్' అంటూ ఢిల్లీ సుల్తానులను జయించింది పగటి వేషంతోనే. అంతదాకా ఎందుకు ? కళింగ గంగరాజు పగటి వేషాలవారి సాయంతోనే శత్రువులను జయించాడనే కథ విన్నదేకదా.

జనంలో ప్రచారం పొందిన పగటి వేషాలలో కొన్ని ఇక్కడ ఉదహరిస్తాను.

1. శక్తి వేషం, 2. భేతాళుడు, 3. దేవర పెట్టె, 4. భోగం వేషం, 5. పాములవాడు, 6. ఎరుకల వేషం, 7. దొమ్మర వేషం, 8. కోయవేషం, 9. కాశీ ప్రయాణం, 10 ఫకీరు వేషాలు, 11. బ్రహ్మంగారి తత్వాలు, 12. అత్త కోడళ్ళ సంవాదం, 13. గొల్లభామ, 14. మందుల వేషం, 15. దాదినమ్మ వేషం, 16. జేగంట భాగవతులు, 17. హరి దాసులు, 18. భట్రాజు వేషం, 19. లింగబలిజ వేషం, 20. సోడిగాడు, 21. బట్టల అమ్మకం, 22. దాసరి వేషం, 23. రెడ్డి వేషం, 24. గంటి భాగవతం, 25. బైరాగుల వేషాలు, 26. బుడబుడక్కల వేషం, 27. సోమిదేవమ్మ, 28. అర్ధనారీశ్వరుడు, 29. వైష్ణవ వేషాలు, 30. పంతులు వేషం, 31. సోదె, 32. వితంతువు, 33. మాదిగ వేషం, 34. తహశీల్దారు, 35. జంతరు పెట్టె, 36 చిట్టిపంతులు, 37. దివాను వేషం, 38. సింగి - సింగడు, 39. అవధాని, 40. మొండి బండవాళ్లు, 41. లంబాడి పడుచు, 42. రాధాకృష్ణ సంవాదం, 43. సోమయాజులు, 44. శారద వేషం, 45. జంగమ దేవర, 46. సాతాని వేషం, 47. పఠాను వేషం, 48. కోమటి వేషం, 49. కాశీ కావళ్లు, 50. వానాలమ్మ, 51. పడుచు పెళ్లాం. 52. ముసలి మొగుడు, 53. గయ్యాళి పెళ్ళాం, 54. పిట్టల దొర, 55. రెవెన్యూ ఇన్‌స్పెక్టర్ - ఇలా మరెన్నో పగటి వేషాలు ప్రచారం పొందాయి.

ఒకనాటిమాట - భారత దేశంలో స్వతంత్ర, సామంత రాజుల పాలనలోనూ చిత్రవిచిత్రములయిన ఈ వేషాలు చాలా ప్రచారంలోకి - వ్యాప్తిలోకి వచ్చాయని అంటారు.

రకరకాల మారువేషాలు ధరించి గూఢచారులుగా సమాచారాలను అందించేవారని చరిత్ర చెబుతూంది. వీరు వర్తకులుగా - రత్నాలు - వజ్రాలు అమ్మే వ్యాపారులుగా కోట లోకి ప్రవేశించి రాజును రాజు వంచించడం - అక్కడి విషయాలను చూసి, అక్కడి బలహీనతలను సేకరించి, దండయాత్రలు చేయడం జరుగుతూ ఉండేది. ఒక్క మాటలో చెప్పాలంటే అలా ప్రారంభమైనవే ఈ పగటి వేషాలు. వీటిని ఒకప్పుడు 'బహురూపాలు' అని పిలిచేవారు.

భరత కోశంలో వీటి ప్రస్తావన ఉంది. సర్వేశ్వర శతకంలో వీటి ప్రస్తావన ఉంది. పండితారాధ్య చరిత్రలో వీటి వివరణ కనిపిస్తుంది.

ఇంతవరకూ మనకు లభ్యమయిన చారిత్రకాధారాలను బట్టి - సుమారు మూడువందల ఏళ్ళనాడు మైసూరు ప్రాంతం నుంచి పల్లావఝుల వెంకట రామయ్య అన్న ఆయన ఆంధ్ర దేశం రావడం రేపల్లెలో ఉంటూ, మనవారికి కొందరికి ఈ పగటి వేషాలను నేర్పాడని అంటున్నారు. తరువాత తరువాత గడ్డిపాడు ప్రధాన కేంద్రం, నివాస స్థానం అయిందని పరిశీలకుల అంచనా.

వీధి భాగవతాలకు కూచిపూడి ఎలా ప్రధాన కేంద్రంగా ఉందో, పగటి వేషాలకు గడ్డిపాడు ప్రధాన కేంద్రం అయింది. పగటి వేషాలు ధరించేవారిలో ప్రధానంగా పల్లావఝులవారు, శ్రీకారంవారు, కూచివారు, కనుపూరివారు, బెల్లంకొండవారు, బాపట్లవారు, కవులవారు ఇలా మరికొందరు. వీరందరినీ తీర్చి దిద్దిన ఆయన పైన పేర్కొన్న మైసూరు బ్రాహ్మణుడు.

కూచిపూడి పగటి వేషాలకు కీర్తిని సంపాదించిపెట్టిన కీర్తిశేషులు – పెద్దిభొట్ల దశరథ రామయ్య, పెద్దిభొట్ల జానకి రామయ్య, పసుమర్తి శేషయ్య, పసుమర్తి చలపతి, పసుమర్తి గోపాలం, హరి లక్ష్మీనారాయణ, చింతా శివరామయ్య, భాగవతుల కుమారస్వామి, భాగవతుల పిచ్చయ్య, వేదాంతం వేంకటేశ్వర్లు, వేదాంతం లక్ష్మీనరసింహం, మహంకాళి లక్ష్మయ్య మొదలయినవారు.

వీరు గతించినా ఆ కళను ఆరాధిస్తూ కళాసేవ చేస్తున్న ఇప్పటి వారిలో మహంకాళి సత్యనారాయణ, వేదాంతం ఘంటయ్య, వేదాంతం పార్థసారథి, హేమాద్రి శివరామ కృష్ణయ్య, చింతా సూర్యప్రకాశరావు, పసుమర్తి అంజయ్య, పసుమర్తి సూర్యనారాయణ, పసుమర్తి సుందర రామయ్య, పసుమర్తి వెంకటేశ్వర్లు, పసుమర్తి విశ్వనాథం, పసుమర్తి శ్రీరామమూర్తి. భాగవతుల కుటుంబశాస్త్రి, భాగవతుల నాగ లింగయ్య, భాగవతుల వెంకటాచలపతి.

ఇలా పగటి వేషాలు తెలుగు ప్రజలకు ఆనందాన్ని తద్వారా విజ్ఞానాన్ని అందిస్తున్నాయి.

## వీధి నాటకాలు

ఇప్పుడంటే రంగస్థలం, హాలు, కర్టెన్లు - ఇలా ఎన్నో విధాల అభివృద్ధి చెందిందిగాని. ఒకనాడు వినోద ప్రదర్శనలు అన్నీ వీధుల్లోనే జరిగేవి.

అసలు ఒకనాడు గ్రామ పంచాయతీల పాలనా వ్యవహారాలన్నీ వీధుల్లోనే ఏ వేపచెట్టుక్రిందో. ఏ రావిచెట్టుక్రిందో జరిగేవి.

ప్రధానంగా వీధి నాటకాలలో రామాయణం, భారతం, భాగవత గాథలూ, బసవపురాణ కథలూ వీధి నాటకాలుగా ప్రదర్శిస్తూండడం పరిపాటి.

వీటిని దేశి నాటక ప్రదర్శనలు అంటే సరిపోతుందను కొంటాను. ఈ దేశీ నాటకాల పురోగతి శివకవుల ఆధ్వర్యం లోనే జరిగింది.

వీధులలో ప్రదర్శించేవారు గనుక వీధి నాటకాలని పేరు వచ్చింది. వీటిని ప్రదర్శించేవారిని భాగోతులనీ అనడం తెలిసిందే.

క్రీ॥ శ॥ 16వ శతాబ్దంనుంచీ ఆంధ్ర దేశంలో ఎక్కువగా యక్షగానాలు రచించడం జరిగింది. అప్పటికే దోర సముద్రపు నటులు వీధి నాటకాలను అనేక రీతులలో ప్రదర్శించినట్లు అలాగే కూచిపూడి భాగవతులు, జంగాలు వీధి నాటకాలను ప్రదర్శిస్తూండేవారనీ తెలుస్తూంది.

యక్షగానాల్లో నాటకోచితమైన రచనా విధానాలు ప్రవేశ పెట్టబడినట్లు సుగ్రీవ విజయం సాక్ష్యంగా చెప్పుకోవచ్చు.

సుగ్రీవ విజయ నాటకంలో కొన్ని కొన్ని పాత్రలలో పాటలు పాడేవారనీ, తక్కిన సంధి వచనాలూ మొదలయినవి ఒకరిద్దరు సూత్రధారులు పఠించడంవల్ల సుగ్రీవ విజయంవంటి యక్షగానాన్ని వీధి నాటకంగా ప్రదర్శించేవారనీ శ్రీ నేలటూరి వెంకట రమణయ్య వంటి చరిత్ర కారులు పేర్కొనే ఉన్నారు.

కూచిపూడి భాగవతుల పేరు 15వ శతాబ్దం నాటికే ప్రచారంలో ఉందనడానికి 1502 నాటి మచ్చుపల్లి కైఫీయత్ ఆధారం. నాటినుంచి నేటివరకూ కూచిపూడివారు ప్రదర్శించే వన్నీ వీధి నాటకాలే.

ప్రధానంగా కూచిపూడి భాగవతులు వారి ఇతివృత్తాలన్నీ పురాణాలకు సంబంధించినవే. ఆధ్యాత్మికమైనవే. నాట్య రూపంలో వీరు ప్రదర్శించే అన్నిటా మనకు భారత, భాగవత, రామాయణ గాథలే ప్రధానం.

వీరి ప్రదర్శనలలో ప్రధానంగా పేర్కొనవలసినవి - త్యాగరాయ కృతులు, జయదేవుని అష్టపదులు, మువ్వగోపాల పదాలు, భద్రాచల రామదాసు కీర్తనలు, నారాయణ తీర్థుల తరంగాలు, సారంగపాణి కీర్తనలు, తుంగతుర్తి కృష్ణదాసు కృష్ణలీలలు, అన్నమాచార్య పదాలు, సింహపురి పదాలు, చిదంబరం ఉషాపరిణయం, సుబ్రహ్మణ్యకవి ఉషాపరిణయం, గొల్ల కలాపం, భామా కలాపం, దాదినమ్మ వేషం, దశావతారాలు, ప్రహ్లాద పట్టాభిషేకం, పరశురామస్తవం, రామ పట్టాభిషేకం, బాలగోపాల తరంగం వంటివి మరెన్నో ప్రదర్శనలు ఇస్తూంటారు.

సిద్ధేంద్రుని ఆశీస్సులతో వెలుగొందిన కూచిపూడి భాగోతుల కీర్తి దేశం నలుమూలలా ప్రచారం పొందింది. అగ్రహారాన్ని దానంగా అంది పేరుపొందింది.

## కురవంజి

మన ప్రాచీన కళారూపాలలో చాలా ప్రాచీనమైంది కురవంజి అని కొందరి అభిప్రాయం.

అసలు మన ప్రాచీన కళ కురవంజని పేర్కొనడమూ జరిగింది.

తెలుగు కావ్యాలలో కురవంజి ప్రస్తావన చాలా చోట్ల అగుపిస్తుంది.

కొందరు కొరవంజి అనీ, కురవంజి అనీ పిలువడమూ కద్దు. ఇంకా పరిశోధకుల దృష్టినుంచి ఆలోచిస్తే కొరవంజి పరిణామమే యక్షగానం అనీ చెప్పక పోలేదు.

కురవంజి విశేషాలను గురించిన విషయ సేకరణలో కురవంజి అంటే కొరవజాతి స్త్రీ అనీ, ఎరుకలు చేసే నాట్య విశేషమనీ చెప్పబడింది.

పదహారవ శతాబ్దిలోనే కురవంజి నృత్య విశేషం ఉందనీ, అప్పటికే అది చాలా ప్రాచీనమయిందనీ అంటున్నారు.

అయ్యలరాజు రామభద్రుడు రామాభ్యుదయంలో 'ఒక్కొణి కొరవంజి మేళముల గేళికలు సల్పిరి' అని పేర్కొనడంచేత అప్పటికే చాలా కాలంగా కొరవంజి నాట్యం చాలా ప్రాచుర్యం పొందిఉన్నట్లు ఊహించవచ్చు.

ఎరుక చెప్పడం మనకు తెలిసిందే-అంతేనా ? స్తంభన, వశీకరణ, ఆకర్షణ, సాముద్రికం - ఇలాంటి విద్యలెన్నో తెలుసు.

ప్రప్రథమంలో విడిగాఉన్న కురవంజి పాత్ర ఏనాడు, ఎలా దృశ్య కావ్యాలలో ప్రవేశించిందో ఇదమిత్థంగా ఇదీ అని చెప్పలేము.

ఈ కురవంజులలో రెండు విభాగాలు గోచరిస్తున్నాయి. అంటే శృంగార కురవంజులు, వేదాంత కురవంజులు అన్నమాట.

ఇక్కడ కొన్ని విషయాలను పరిశీలించక తప్పదు.

శృంగార కురవంజులు - అన్నప్పుడు నాయికా నాయకుల ప్రణయానికి సంబంధించినదన్నమాట.

వీటిని ఒకటి, రెండు మూడు భాగాలుగా విభజన చేసుకోవలసి ఉంటుంది.

1. కొరవ నాయకుల ప్రణయాన్ని మాత్రమే చిత్రించే కొరవంజి. వీటి క్రిందకు వచ్చేవి - ఉదాహరణకు గరుడాచల యక్షగానం, కిరాత విలాసం. ఈ తరహా కురవంజిలో కురవంజి సోది చెప్పదు.

2. ఇందులో రెండో రకం ఉంది. ఈ రకం శృంగార కురవంజులలో ఏ పార్వతీదేవో, కథానాయకుడో కురవంజి వేషంలో వెళ్ళి నాయికకు సోది చెప్పడం అన్నది ఉంటుంది. అంటే - ఇందుకు ఉదాహరణగా తులాభారం, మన్నారుదాస విలాసాలను పేర్కొన వలసి ఉంటుంది.

3. మూడవ రకం కొరవంజి ఉంది. ఆ కొరవంజిలో ఎరుకత మామూలు ఎరుకతేగాని దేవగణానికి చెందిందికాదు.

ఇక వేదాంత కురవంజిని గురించి చెప్పవలసివస్తే - ఇది ప్రధానంగా వేదాంత బోధకు సంబంధించి ఉంటుంది.

## కలాపాలు

ప్రజలలో పుట్టి, ప్రజల ఆదరణతో పెరిగి, ప్రజల కళలుగా అనుశ్రుతంగా వస్తూన్నవే ఈ కళలు. మన జాతి సామాజిక, సాంస్కృతిక జీవన విధానంతో పెనవేసుకొని ప్రజా జీవితాలను ప్రతిబింబిస్తూంటాయి కనుకనే వీటిని జానపద కళారూపాలుగా చెప్పబడుతూంది.

ఒకనాటి మన సంప్రదాయాలు ఏమిటి ? ఆనాటి సాంఘిక, రాజకీయ, కళాత్మక విలువలు ఎలా ఉండేవి ? అని తెలుసుకోడానికి ఈ జానపద కళారూపాలు చూస్తే బోధ పడుతుంది.

ఆనందంతో, ఆవేశంతో ప్రకృతికి పులకించి పలికిన పలుకే పాటై ప్రవహించింది, వేసిన అడుగు నృత్యమై వెలసింది.

జానపద కళారూపాలలో కలాపం చాలా ప్రసిద్ధమూ, ప్రాచీనమూ అయినది.

భామా కలాపం, గొల్ల కలాపం, చోడిగాని కలాపం - ఇలా కలాపాలున్న పేరున చాలా ఉన్నాయి.

ఏక పాత్రతో కూడిన నాటకాలనుంచి ద్విపాత్ర, బహు పాత్రలతో కూడిన నాటకాలవరకూ వచ్చాయి. ఏదో ఒక వాయిద్యాన్ని ఉపయోగిస్తూ నాట్యంచేస్తూ ఒక వీరగాథనో, మరో గాథనో గానం చేయడం అన్నది నాటకానికి తొలి రూపంగా మనకు గోచరిస్తుంది.

ఒక్క మాటలో చెప్పుకోవాలంటే యక్షగాన ప్రబంధాలకు రూపాంతరాలే కలాపం, బుర్రకథ, హరికథ.

ఏదో ఒక నాయిక పాత్రను ధరించి ఆడుతూ, పాడుతూ తన కథను తానే మనకు చెప్పే యక్షగాన రూపమే కలాపం.

భామాకలాపం, గొల్లకలాపం వంటివి దేశికిందకు రావు. మార్గ శాఖకు చెందినవి. అయితే చోడిగాని కలాపం మొదలయినవి దేశీ శాఖకు చెందినవి.

కలాపం అన్నది, కలాప రచనలు అనేది వ్యవహారంలో ఉన్న పేరు.

సరే ! భామా కలాపం, గొల్ల కలాపం మొదలయిన వాటిలో పేరులోనే కలాప పదాన్ని అలంకరించుకొన్నాయి.

అంతే కాకుండా, కూరాకుల, కురవంజి, దాటిని, దాక్షిణీ, పంతులు వేషాలు మొదలయిన వాటిలోకూడా తమ కథా కథనాన్ని కలాపమనే పేరుతోనే వ్యవహరిస్తూ ఉంటాయి.

కలాపాల ముఖ్య లక్షణం ఆడి పాడి అభినయించడం. పామరులను సైతం ఆకర్షించుకొని, అర్థం అయేలా నిలచిన

కలాపాలు - రసాత్మకతను నింపుకొని ఉండడమే ఇప్పటికీ సజీవ కళలుగా నిలిచి ఉండడానికి కారణం.

ఇంతకీ ఈ కలాప ప్రదర్శనలు ఎప్పటినుంచి ప్రచారం లోనికి వచ్చాయి ? అని ప్రశ్నించుకొంటే ఇదే సమయమని చెప్పడానికి తగిన ఆధారాలు కనిపించవు. అపూర్వ ప్రచారం తెచ్చిపెట్టినవారుగా కూచిపూడి వారినే పేర్కొనవలసి ఉంటుంది.

చోడిగాని కలాపం - చోడిగాని వేషం - చేతిలో వంకర కర్ర, కాలికి కడియారు, గోచీ, కంబళీ, అర్ధంగా కట్టిన తల గుడ్డతో చోడిగాడు మనకు ప్రత్యక్షం అవుతాడు.

ఇతగాడి వేషం హాస్యంగా ఉంటుంది. ఆహార్యం - ఒంటినిండా సున్నపుబొట్టులూ, మధ్య నల్ల చుక్కలూ, కాకి ఈకల కుచ్చు ఇదీ ఇతని వాలకం.

పల్లెలలో - దసరా ఉత్సవాలలో గొంతాలమ్మ పండు గలలోని ప్రదర్శనల్లో ఇతగాడిదే అగ్ర తాంబూలం.

ఇతనికి పేర్లు అనేకంగా వినిపిస్తాయి. సోలెగాడు, చోలె గాడు, చోడిగాడు, సింగడని ఇలా పిలుస్తూంటారు.

ఇతగాడి పాత్ర మనకు కొత్త ఏంగాదు. ఆంధ్రజన జీవి తంలో - ప్రాచీన కళారంగంలో జీవించి ఉంది.

తోలుబొమ్మల ఆటలో జుట్టు పోలిగాడు, బంగారక్క, అల్లాటప్పగాడులకీ ఎటువంటి ప్రాముఖ్యం ఉందో ఈ చోడి గాడికీ, చోడిగాని కలాపంలో అంతటి ప్రాధాన్యం ఉంది. ఇక్కడ జుట్టు పోలిగానికీ, చోడిగానికీ పాత్రలలో కాస్త తేడా ఉంది. బొమ్మలాటలలో అవి హాస్య పాత్రలు మాత్రమే. చోడిగాని కలాపంలో ఇతడు హాస్యగాడూ, కథానాయకుడూ కూడాను. కురవంజి కథా రూపంలో సింగీ సింగని ప్రణయ కలహమే ఈ చోడిగాని కలాపానికి కథా వస్తువు. దీనికి ఎరు కల కథ అనీ పిలవడం కద్దు. దీనిలోని కథా వస్తువైన చెంచు లక్ష్మీ నృసింహుల వివాహగాథను క్రీ॥ శ॥ 1600 ప్రాంతంలో గరుడాచల మహాత్మ్యమనుపేర ఓబయమంత్రి యక్షగానంగా రాశాడు.

## తోలుబొమ్మలు

మన ప్రాచీన కళా రూపాలలో తోలుబొమ్మలు ఒకటి. ఇవి క్రీస్తు పూర్వం 3 వ శతాబ్దినాటికే చాలా ప్రచారంలో ఉన్నాయని తెలుస్తూంది.

తెలుగువారి ప్రాచీన కళా వైదగ్ధ్యాన్ని ఖండాంతరాలకు వ్యాపించి పెట్టిన కళ ఇది. నేడు పాశ్చాత్య దేశాలలో గొప్పగా చెప్పుకొనే ఛాయా ప్రదర్శనాలకు మూలం ఈ తోలు బొమ్మలే.

ఖండాంతరాలకు - జావా, బోర్నియో, సుమిత్ర, బలి, సయాం, కంబోడియా, బర్మా మొదలయిన దేశాలలో - మన దేశంనుంచి వలస వెళ్ళినవారు - తోలుబొమ్మలను ప్రదర్శిస్తూ, రామాయణం, భారతం మొదలయిన కథలను ఎక్కువగా ప్రదర్శిస్తుంటారు. వీటిని ప్రదర్శించేవారు బొందిలీలు, బొందిలీ క్షత్రియులు, బొందిలీ కాపులు. వీరి భాష మరాఠీ.

వీరికి ఉన్న ఆస్తి ఒక్క తోలుబొమ్మలే. పాల్కురికి సోమనాథుని కాలానికే ఇది వినబడింది. ఈ బొమ్మలను రెండు రకాల చర్మాలతో తయారుచేస్తారు. దేవతా విగ్రహాలకు జింక చర్మాన్నీ, రాక్షస బొమ్మలకు మేక చర్మాన్నీ వాడడం కద్దు.

ప్రదర్శనకు - ఒక తెల్లని తెర, హార్మోనియం, తబలా, కాగడాలు - ఇవీ వస్తువులు. ప్రదర్శన వినాయకుని బొమ్మ తెరమీదకు రావడంతో ప్రార్థన చేయడంతో ప్రదర్శన ప్రారంభం అవుతుంది.

## భజన కూటములు

మన గ్రామాలలో ప్రతిచోటా దేముని మందిరం - ప్రార్థనా మందిరం లేకుండా లేదు. ఇక్కడ నృత్యంచేస్తూ, చిరుతలు, తాళములు పుచ్చుకొని, కాళ్ళకు గజ్జలు కట్టుకొని "హరిలో రంగ హరీ..." అంటూ అడుగులు వేస్తూంటే భక్తి పారవశ్యంలో మునిగిపోతాం.

కూచిపూడి భాగవతులు శ్రీకృష్ణ జన్మాష్టమి మొదలయిన పండుగలలో అనేకమంది సాతాని భక్తులూ - నామాలు ధరించి, దీపపు సెమ్మ పుచ్చుకొని గానం చేయడం కద్దు.

భజన సమాజాలలో నృత్యం చేసేవారు 20 మందిదాకా ఉంటారు. ఇటువంటి భజనలలో నోటితో పాట, చెక్కలద్వారా తాళం, గజ్జెలు అలంకరించిన కాళ్ళతో నృత్యం - చూడడానికి, వినడానికి ముచ్చటగా ఉంటుంది.

దీనిని లయతప్పకుండా ప్రదర్శించాలి. శ్రమతో కూడిన కళ. మన భక్తిరస ప్రధానములయిన కళా రూపా లలో భజనలు ఒకటి. హరి భజనలు, పండరి భజనలు - ఇలా మరెన్నో వున్నాయి.

## బుర్రకథలు

మన జానపద కళా సంపదకు లోటులేదు. కావలసినన్ని జానపద కళారూపాలు మనకు ఉన్నాయి.

బుర్రకథలు ఎప్పటినుంచీ ప్రచారంలో ఉన్నాయో సరిగా తెలియదు. కాని రామాయణ కాలానికే - ఇవి ఉన్నట్లు తెలుస్తూంది. మొత్తంమీద బుర్రకథలు చాలా ప్రచారంలోఉన్న ప్రాచీన కళ. వీటిని జంగం కథలు అంటారు. మత ప్రబోధానికీ, రాజకీయ ప్రబోధానికీ, దేశభక్తికీ నిలయంగా ఇవి ఉండేవి. జంగం కథలను ఎక్కువగా జంగాలే చెప్పడంవల్ల వీటికి ఆ పేరు వచ్చింది. ఈ కథలను ఎక్కువగా ప్రచారంలోకి తెచ్చినవారు సిరికి జంగాలు, బురిగె జంగాలూ, సెట్టి బలిజెలు, సెట్టి ఫణిజెలు. ఈతముక్కలవారూ వంశ పారంపర్యంగా ప్రచారంలోకి తీసుకువచ్చారు.

శైవ వైష్ణవ కలహాల కాలంలో ఈ కథకు చాలా ప్రాచుర్యం లభించింది. క్రీ॥ శ॥ 1150 నాటికే ఈ కథలు బాగా ప్రచారంలో ఉన్నట్లు తెలియవస్తూంది.

జంగం కథను సంగీత జానపద కళారూపంగా చెప్పుకోవచ్చు. ఈ కథలకు బహు నామాలు, కథకులకు బహు రూపాలు.

ఒకనాడు శైవ, వైష్ణవ మతాల ప్రచారాలకు, భక్తి ప్రబోధానికీ ఉపకరించిన ఈ బుర్రకథలు ప్రస్తుతం రాజకీయ ప్రచారాలకు ఉపయోగిస్తున్నాయి.

## జానపద కళారూపాలలో ఎన్నో - మరెన్నో

జానపద రూపాలలో ఒకొక్క కళను గురించి ఒకొక్క గ్రంథం రాయవచ్చు. ఇక్కడ స్థలాభావంచేత పేర్లతోనే ముగిస్తున్నాను.

కీలుబొమ్మలు, బుట్టబొమ్మలు, శారదగాండ్రు, మూకాభినయాలు, వీరభద్ర విన్యాసం, జముకుల కథలు, గారడీ ప్రదర్శనలు, డప్పుల కోలాటం గరగ నృత్యం, పులివేషాలు, కాముని పున్నమి వినోదాలు, గొల్లసుద్దులు, వీరముష్టివారు, ఫకీరు వేషాలు, తుమ్మెద పాటలు, గోండుజాతి నృత్యాలు, విప్ర వినోదులు, బతుకమ్మ, బొడ్డెమ్మ పండుగలు, సాధనా శూరులు, గంటె భాగవతులు, కాటిపాపటివాళ్లు, బైండ్లవాళ్లు, కోలాట నృత్యం, దొమ్మరాటలు, జంతరుపెట్టె, వీధి పురాణం, అశ్వ నృత్యం, పిచ్చుకుంటల కథలు, హరిహరీ పదాలు, ఘట నృత్యం, కాశీకావళ్లు, బుడబుడక్కలు - ఇలా ఒకటేమిటి - తెలుగు కళామతల్లి మణిహారాలుగా ఎన్నో వర్ధిల్లాయి - వర్ధిల్లుతున్నాయి.

ప్రతి కళకూ ఒక చరిత్ర - ఒక ప్రత్యేకత ఉంది.

జానపద కళారూపాలు - ఇంకా ఎన్నో మరెన్నో దేశవ్యాప్తంగా ప్రజలమధ్య - ప్రజానందాన్ని అందిస్తూ - ప్రజా కళలుగా వర్ధిల్లుతూనే ఉన్నాయి.

వీటికి ఒక పట్టుదలతో కూడిన సంస్థ ఏర్పడి - జానపదోద్ధరణకు, కళోద్ధరణకూ నడుంబిగిస్తే-ఆంధ్ర జానపదకళలు తిరిగి విజయ పతాకను ఎగరేస్తాయనడంలో సందేహంలేదు.

# తెలుగు లెస్స

జనని సంస్కృతంబు సకల భాషలకును
దేశ భాషలందు తెలుగు లెస్స
జగతి తల్లి కంటె సౌభాగ్య సంపద
మెచ్చుటాడు బిడ్డ మేలుగాదె.

శ్రీనాథమహాకవి.

# మారుతున్న గ్రామీణ జీవితం

జె. బాపురెడ్డి

భారతదేశం పల్లెల్లో నివసిస్తున్నది. ఇది సకలజన విదితమైన సత్యం. ప్రపంచలోని గ్రామీణ జనాభాలో సుమారు 50 శాతం ఇండియా, చైనా దేశాల గ్రామీణ జనాభాయే. సంతోషకరమైన విషయం ఏమిటంటే నూటికి 80 శాతం ప్రజలు నివసిస్తున్న గ్రామ ప్రాంతాలను అభివృద్ధి చేయాలనే విషయంలో మన ప్రభుత్వమూ, ప్రజలూ దృఢ సంకల్పంతో కృషి చేస్తున్నారు.

గ్రామ జీవితంలో వస్తున్న ప్రగతికి పల్లెసీమల భౌతిక స్వరూపం (Physical science) అద్దం పడుతున్నది. పల్లెల బాహ్యరూపం పరిశీలిస్తే ఎంతో ఆసక్తిదాయకంగా ఉంటుంది. శతాబ్దాలుగా కరుడుకట్టిన నిరీహ, నిస్సహాయ పూరిత గ్రామీణ జీవితంలో కలిగిన విప్లవాత్మకమైన మార్పులకు చిహ్నాలేమిటి - అదుగో! ప్రజాస్వామ్య నిలయంగా, చైతన్యాలయంగా రూపొందిన గ్రామపంచాయతి, క్రొత్తగా కట్టిన భవనంలో బడి, వీధి వీధిలో విద్యుద్దీపాలు, వాడవాడల్లో మురికిని కడిగే కాలువలు, బలహీనవర్గాల నూతన గృహసముదాయాలు, టకటకా భూమిని దున్నే ట్రాక్టర్లు, చకచకా నీరుచిమ్మే మోటర్లు, తీరైన రసాయనిక ఎరువులు, మేలురకపు విత్తనాలు, అధిక దిగుబడినిచ్చే పంటచేలు, ఉద్యోగాలు పెంచే పరిశ్రమలు, శ్రమ తగ్గించే యంత్రాలు, అప్పులిచ్చే బ్యాంకులు, ఆప్యాయంగా వచ్చిపోయే బస్సులు - వర్తమానాలు, వార్తలు అందించే పోస్టాఫీసులు, టెలిఫోన్లు, స్త్రీ శక్తిని చాటే మహిళా మండలులు. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, రక్షిత మంచినీటి చలివేంద్రాలు - ఇవన్నీ గ్రామ సీమల్లో మనకు స్వాగతం పలికే క్రాంతి తోరణాలు. అడుగడుగున మార్పు వెలిగిస్తున్న ఆనంద పాలుదీ.

గ్రామీణ జీవితాన్ని చీకటి కూపంలోకి నెట్టినది అవిద్య. విద్య లేకపోతే విజ్ఞానం లేదు. విజ్ఞానం లేకపోతే మనకు ఎన్ని అవకాశాలున్నా ఉపయోగించుకునే ప్రజ్ఞ ఉండదు. అందుచేత బాలబాలికలందరికీ తప్పనిసరిగా ప్రాథమిక విద్యాగంధం అందించాలని ప్రభుత్వం చట్టరీత్యా ప్రయత్నిస్తున్నది. బలహీన వర్గాలవారి అభాగ్యులైన పిల్లల భావి సౌభాగ్యానికి విద్య ప్రధాన సాధనంగా ఉపకరిస్తున్నది. పల్లెల్లో ఈనాడు చెట్టుపై పక్షుల కిలకిలారావాలతోపాటు, ప్రతి ఇంటిలో పసివారి పాఠ్య పఠనా రవాలుకూడ వీనులవిందుగా వినుపిస్తున్నాయి. గుడిలో దైవభక్తి దీపంతోపాటు పల్లెబడిలో విద్యానురక్తి దీపంకూడ వెలుగుతున్నది. సాధారణ విద్య వయోజన విద్య విజృంభిస్తుంటే నిరక్షరాస్యత వెనుదిరిగి పోతున్నది.

అక్షరాభ్యాసం కోసంకూడ ఆమడల దూరం అర్భకులు వెళ్ళ వలసివచ్చిన ఒకనాటి దయనీయ స్థితిపోయి, పుట్టిన ఊరిలోనే, లేక ప్రక్క ఊరులో హైస్కూలు విద్య, కొన్ని సందర్భాలలో కాలేజీ విద్యకూడ అభ్యసించడానికి అనువైన పరిస్థితులు ఏర్పడ్డాయి. అట్లాగే విద్యతోపాటు వైద్య సౌకర్యాలుకూడ ఆరోగ్య కేంద్రాలద్వారా అనవరత సంచార వైద్య సిబ్బంది ద్వారా ఆబాలగోపాలానికి అందుతున్నాయి.

గోచీ పెట్టుకొని, గొంగళి వేసుకొని గొర్లనో, గొడ్లనో కాసుకునే నిరుపేదకూడ నేడు సరికొత్త జీవితాన్ని ఎలుగెత్తి పిలుస్తున్నాడు. ఎండలో ఎండి, వానలోనాని, వరదలో కొట్టుకపోయి, బురదలో ఇరుక్కుపోయి యమయాతనలుపడ్డ బడుగు బ్రతుకులు నేడు గుండె ధైర్యంతో నిలబడి, ప్రభుత్వాదరణల గొడుగు పట్టుకొని క్రొత్త అవకాశాల ఇల్లు కట్టుకుని సుఖజీవితోన్ముఖుడై సాగిపోతున్నాడు. ఒరులకు ఊడిగం చేసినవాడు నేడు స్వయం ఉపాధి కల్పించుకుంటున్నాడు. గోళ్ళు గిల్లుకుంటూ కూర్చున్నవారు ఇప్పుడు ఉత్పాదన రంగంలో వ్రేళ్ళు తన్నుకుంటున్నారు. వడ్డీ వ్యాపారస్తుల వైకుంఠపాళిలో చితికిపోయిన పేద బ్రతుకులు, ప్రభుత్వ బ్యాంకుల ప్రసన్న దృక్కుల్లో ప్రఫుల్లమౌతున్నాయి. ఒకవైపు సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థలు, మరొకవైపు హరిజన, గిరిజనాది పేదవర్గాల ఆర్థిక సహాయ సంస్థలు గ్రామీణ ప్రాంతాలలోని కష్టజీవులను దరిద్రరేఖ దాటించడానికి ధనసహాయం చేస్తున్నాయి.

ట్రాక్టర్లు ఆయిల్ ఇంజన్లు, కరెంటు మోటార్లు పల్లె పొలాలలో అవతరించాయి. క్రొత్త చెరువులు, కుంటలు, బావులు, గొట్టపు బావులు నీటి పాటలుపాడే జీవనృదృశ్యాలు పల్లెల్ని అలంకరిస్తున్నాయి. పాతాళపు లోతులలో దాగిన అఖండ జలధారలను రిగ్గులు బయటికి తీస్తుంటే ప్రజాశక్తి భాగీరథులు పల్లెపల్లెల్లో గంగావతరణ చేస్తున్నట్లు అనిపిస్తుంది. ఎరువుల్లేక, ఎద్దుల్లేక, విత్తంలేక, విత్తనంలేక రైతులు దిగాలు పడిపోయే, పొలాలు పడావా పడిపోయే విషమ పరిస్థితులు పల్లె జీవితంనుంచి క్రమంగా నిష్క్రమిస్తున్నవి. వ్యవసాయ ఉపకరణాల గిడ్డంగులు, సహకార, వాణిజ్యం బ్యాంకులు రైతుల అవసరాలు తీర్చడానికి స్నేహ హస్తాలు చాస్తున్నవి. ప్రయోజనకరమైన పని చేపట్టే ప్రతివానికి అడగగానే అప్పులిచ్చే ఆర్థిక సంస్థలు గ్రామీణ జీవితంలో మార్పు రథచక్రాలు లాగుతున్నాయి.

విద్యుచ్ఛక్తి గ్రామీణ జీవితానికి క్రొత్త వెలుగు ప్రసాదిస్తున్నది. గ్రామీణ విద్యుదీకరణ పథకాలవలన వీధివీధిలో, ఇంటింటిలో కాంతిరేఖలు వెలుస్తున్నవి. చీకటి కంకటిమీద సొమ్మసిల్లిపోయిన హరిజన, గిరిజన వాడలకు గ్రామపంచాయితీలు వెలుగు సేచనము కలిగిస్తున్నవి. పల్లెసీమల్లో నేడు సౌభాగ్య సంగీతం, సంతోష దరహాసం పండించేది నేనంటే నేనని విద్యుత్తంత్రులు, భూగర్భ జలతరంగాలు పోటీపడుతూ మార్పు గీతాలు పాడుతున్నాయి.

పల్లె స్త్రీలు ఆర్థికంగా వెనకబడ్డా ఆలోచనా పరంగా వారు అభ్యుదయ శీలురే. దేశ జనాభాలో సగంమంది మహిళలే. వారు ప్రగతి పథంలో పయనిస్తే తప్ప జాతి జీవనంలో రావలసిన మార్పు రాజాలదు. పల్లె స్త్రీల మనుగడలో ఆచార వ్యవహారాలలో ఆరోగ్యకరమైన మార్పులు వస్తున్నవి. ఊరూరికీ మహిళా మండలులు ఏర్పడుతున్నాయి. అవి స్త్రీ సమగ్ర సంక్షేమానికి, సంపూర్ణ వ్యక్తిత్వ వికాసానికి కంచుకోటల్లాగ తయారవుతున్నాయి. స్త్రీ కేవలం వంటింటి కుందేలు కాదని పట్టణ స్త్రీలకంటే ఎక్కువగా పల్లె స్త్రీలు నిరూపిస్తున్నారు. పురుషులతోపాటు విద్య, వృత్తి విద్యా గ్రంథం అందించి స్త్రీలు కుటుంబ ఆదాయానికి తోడ్పడేటట్లు వారికి ధనసహాయం సంతరించి బాల్య వివాహాలు, వరకట్నాలువంటి దురాచారాలకు దూరంగా వారిని పెంపుచేయడానికి ప్రబల ప్రయత్నాలు జరుగుతున్నాయి. విద్యుచ్ఛక్తి, రక్షిత మంచి నీటి సరఫరా, పిండి, బియ్యం మిల్లులు మొదలైనవి గ్రామ ప్రాంతాలలో స్త్రీల జీవిత సుఖానికి వరప్రసాదంగా వర్ధిల్లుతున్నాయి.

పేదవర్గాలవారికి సముచిత గృహనిర్మాణ పథకాలు, పనికి ఆహారం పథకంక్రింద చేపట్టిన ప్రత్యేక నిర్మాణ కార్యక్రమాలు, పల్లె జీవితంలో గుణాత్మకమైన మార్పు తెస్తున్నవి. వెట్టిచాకిరి నిర్మూలనం, కనీసవేతన చట్టాలు, ఊరూరికి బస్సు పథకం, పరిమిత కుటుంబ పద్ధతులు, చెట్ల పెంపకం, నిత్యావసర వస్తువులు సరఫరాచేసే సహకార మార్కెట్లు, చౌక దుకాణాలు, పాలశీతలీకరణ కేంద్రాల ద్వారా పాడిపశువుల అభివృద్ధి, మేలిరకపు కోళ్ళు, గొర్ల పెంపకం, అధునాతన వ్యవసాయ పద్ధతులు, మొదలైన మార్పులు గ్రామీణ జీవితాన్ని గణనీయమైన అభివృద్ధి స్థాయికి చేర్చినవి. *

# PROGRESS IN THE FIELD OF EDUCATION IN ANDHRA PRADESH

**B. VENKATARAMA REDDY**

ANDHRA PRADESH, the fifth largest state in the country in terms of population, made commendable progress in the field of education, both at the lower and higher levels during the past twenty four years. From a stage, when high schools were very few and colleges only a handful in each district, the State has now reached a position where it can boast of high schools even in remote areas and colleges in large numbers in all the districts. The percentage of enrolment in educational institutions of all types had gone up many fold since the inception of the State.

The number of primary schools in 1956 was only 29,076 with 24.54 lakh children studying in them. The teachers working in these schools totalled 77,065. By 1979-80, the primary schools in Andhra Pradesh reached a figure of 39,955 and the number of students in them increased to 51.13 lakhs. Thus, enrolment at primary level more than doubled during the past 24 years. It was 80.3 percent of the school age population of 6-11 years in 1979-80. The number of teachers in primary schools also increased to 78,834.

The percentage of enrolment of girls in the age group 6-11 too increased from 44.1 in 1956 to 68 in 79-80.

Evening and night primary schools were opened in 235 villages to provide educational facilities to the children unable to attend day schools for economic reasons. Most of them belong to farm labourers, industrial workers and other weaker sections.

The State of Andhra Pradesh has been the first to realise the consequences of the present low level performance of the primary education sector. In June 1978 the Govt. of Andhra Pradesh constituted an autonomous organisation called "The Abhyudaya Pradhamika Vidya Samstha" (Progressive Primary Education Authority). The fundamental aim of this organisation is to attempt on an experimental scale

the immediate qualitative improvement of primary education. 660 Model Primary Schools in all the 23 districts of the State were started under the management of this Samstha.

This project contemplates (i) School buildings with minimum physical facilities, (ii) the minimum necessary equipment mostly improvised using locally available material to impart qualitative education, (iii) better trained teachers, (iv) motivated students and above all, (v) a community willing to contribute its share in the enhancement of the school resources. Orientation courses were organised at six centres where 1,500 teachers were trained. 65,000 pairs of uniforms were supplied to the needy children during 1970–80. All the children of the Model Schools have been brought under the mid-day meal scheme ensuring 100% coverage. Medical inspection of all the pupils and teachers of Model Schools has also been arranged.

In the context of universalisation of primary education, non-formal education is an essential strategy to achieve the required goals. The State Council for Educational Research & Training (SCERT) has developed a course content in literacy and numeracy skills and environmental studies which are relevant to the needs of children who are unable to avail of the facilities of formal education. The State Government started 2,640 non-formal education centres in 1979–80 to benefit the non-enrolled children and school drop-outs of the age group 6–13. Two blocks are selected in each district and 60 centres started in each block. The total number of these centres is 2,640 with 66,837 children on their rolls. 1,320 new centres were opened during 1980–81 enrolling another 35,500 children. The primary education curriculam of 5 years is revamped to two years' course divided into graded units.

There was a phenomenal increase in the number of upper primary schools during 1956–80. Their number increased from 329 in 1956 to 4,472 in 1979–80. The number of teachers in these schools rose from 4,421 to 34,923 during the same period. Enrolment of girls in these schools increased from 6.1% in 1956-57 to 21.5% in 1979-80, while that of the boys rose from 20.9% to 40.5%. The number of scheduled castes children in upper primary schools almost trebled from 32,325 in 1960-61 to 95,063 in 1979–80 while that of scheduled tribes students increased nearly seven times from 2,383 to 14,826. 330 special coaching centres for the benefit of the children of scheduled castes and scheduled tribes (15 per district) appearing for the VII Class common examination were started during 1977–78 and they are continued year after year.

In the case of Secondary Schools too, there was impressive growth. Their number jumped up from 733 in 1956–57 to 3,599 in 1979-80. The total number of children enrolled in the Secondary School increased from 2.09 lakhs in 1956–57 to 7.21 lakhs in 1979–80. The enrolment of girls at the secondary stage went up from 32,894 to 2,16,291 during this period.

Residential schools are being run at seven places — Sarvail in Nalgonda District, Keesargutta in Ranga Reddy District, Kodiganahalli in Anantapur District, Tadikonda in Guntur District, Kinnerasani Dam Site in Khammam District, Upper Sileru in Visakhapatnam District (for Scheduled Tribe students) and Vikarabad (for girls only). One Residential Junior College is run at Nagarjuna Sagar. These institutions cater to the needs of talented rural children and most of them have scored cent per cent passes in the public examinations.

Special coaching centres at the rate of ten in each district were opened to help scheduled castes and tribe students appearing for Tenth Class public examinations to improve their standards.

There is a phenomenal progress in the education of girls at the secondary stage during the past

twenty four years. The enrolment of girls increased from 32,894 to 2,16,291 from 1956-57 to 1979-80, registering a growth of 557%. The enrolment of girls at the secondary stage of education to the corresponding age group rose from 2.1% in 1956-57 to 11.7% in 1979-80, while the percentage of enrolment in the case of boys increased from 15% to 26.7%

Realising the urgency to reduce cognitive load on the children at the primary stage and to provide for opportunities that would involve them in physical activity at this stage, the Govt. of Andhra Pradesh decided to revise the curriculam on the lines recommeneded by the Eswarbhai Patel Committee Report. The revised curricularm has been introduced in Classes I to V during this year 1980-81 in all the schools in the State. The revised curriculam for Classes VI to VII will be introduced during 1981-82 and for Classes VIII to X during 1982-83.

During 1978-79, scouting was made compulsary to school children. The aim is to see that every student in Secondary School is enrolled in the Scouting and Guiding Movement. Our Chief Minister, Sri T. Anjaiah was pleased to sanction a generous increase in the budget of this programme, to give a further fillip to this worthy service activity which inculcates discipline and spirit of service among students.

The State witnessed impressive growth in collegiate and higher education. It now has five universities at Visakhapatnam, Hyderabad, Tirupathi, Nagarjunasagar near Guntur and Warangal. Besides a Central University is located at Hyderabad. At Anantapur, we have a Post-Graduate Centre, which is blooming up as Krishna Devaraya University, very soon.

The number of degree colleges in the State in 1956 was 57 which went up to 250 in 1980-81. With the introduction of Intermediate replacing Pre-University Course, Junior Colleges came into existence. Their number which was 233 in 1973-74 increased to 389 in the current academic year 1980-81. Considering that the routine acamedic orientation will not alone make the student self-reliant, the Govt. introduced Vocationol courses at +2 level in a big way and it is planned to cover all the colleges in a phased programme. To provide application oriented pursuit of knowledge at the undergraduate level, Govt. have had initiated the process of restructuring of courses in accordance to the guidelines given by Prof. Venkata Ramaiah's Commitee's Report. Introduction of "Field Work" as a part of the curriculum is also under active consideration of the Government.

The number of students on the rolls of Colleges increased from 46,463 in 1956-57 to 3.26 lakhs in 1973-74. It exceeds four lakhs at present.

A number of student and Teacher welfare measures were introduced during the last two years. Consultative Committees, comprising teachers, students and parents are found in every district.

Sports are given the maximum importance in Andhra Pradesh. The budget for the sports activities has increased to the maximum by Sri T. Anjaiah, our Chief Minister. A Sports Hostel for the tribal bcys will be started shortly.

The State Government declared its policy adopting Telugu as medium of instruction with effect from 1969-70. For the benefit of candidates whose qualifying examination is other than Telugu, parallel sections are provided in some of the Junior and Degree Colleges in the State in media like English, Urdu, Hindi, Tamil, Marathi and Kannada.

In view of the important and close links between education and employment, the Government of Andhra Pradesh introduced on a pilot basis,

vocational courses in 22 selected Junior Colleges during the year 1979-80. The courses relate to (1) Engineering Technology, (2) Agriculture Animal Husbandry and Home Science and (3) Commerce and Business Management.

Government constituted Telugu Akademi for the development of Telugu Language during 1968. The objectives of the Akademi are :

1. Modernising the language.
2. Taking all steps including the preparation of textbooks for the Universities, to switch over to Telugu as the medium of instruction in the Universities.
3. Co-ordinating with the Government in the easy switch over to Telugu as the language of administration as early a time as possible.

The Telugu Akademi prepared and published Telugu medium text books in different non-language subjects both for intermediate and degree courses.

During 1975-76, the International Telugu Institute was started at Hyderabad for promoting study and research of Telugu literature, language, history, art and culture in India and adroad.

The programme of promoting adult literacy is given an impetus in Andhra Pradesh during the last three years. Besides, the various centres organised by N. S. S. and Nehru Yuvak Kendras of various universities in Andhra Pradesh, Government have had started more than 6,900 centres in Andhra Pradesh with 23 projects. Some more projects are being planned to be started. Shramik Vidya Peets at Hyderabad and Guntur, started last year, are rendering yeomen service for Workers Polyvalent Education. The Government desires to start two more centres this year with the help of the Government of India.

A bill to reform, organise and develop the educational system obtaining in the State of Andhra Pradesh and to consolidate and amend the laws relating there to for the said purpose, to provide for the regulation and control of private educational institutions in the State in the interests of the public in general and of the students in particular was introduced in the Assembly/Council on 27-3-1979. The Bill when passed will necessitate substantial modifications to existing rules.

With blessings and good wishes of all Telugu Speaking people of Andhra Pradesh and the Telugu speaking brethren settled in other states and countries, Andhra Pradesh would march ahead for further strides of propress in the realm of Education.

****

## తల్లి !

తల్లి నీ యుత్సవము గాంచ దరలి నార
లనుగు దనయులు నై వేద్య హస్తులగుచు,
ధన్యులెల్లరు నాత్మోచితంపు కాన్క-
లర్పణము సేయ వచ్చిరి యందికొమ్మ !

-ధువ్వూరి రామిరెడ్డి.

# ఆంధ్రప్రదేశ్‌లో సాంస్కృతిక సంస్థలు

అంతటి నరసింహం

'సంస్కృతి' పదాన్ని నిర్వచించేటందుకు చాలా మంది పెద్దలు ప్రయత్నం చేశారు. కాని అది ఏ భాషలోనూ నిర్వచనానికి అందలేదు. అందుకే వివరించడానికి ప్రయత్నించేశారు. అదికూడా అపరిపూర్ణంగా ఉండిపోయింది. నాగరికతనే సంస్కృతిగా భావించారు కొందరు. ప్రాకృతికస్థితినుంచీ ఎదుగుతూ వచ్చిన మానవుడు భౌతికంగా సాధించిన ప్రగతిని నాగరికత సూచిస్తుంది. లోపలి చైతన్యాన్ని, ఆ చైతన్యం సృష్టించిన శాశ్వతమైన విలువల్ని సంస్కృతి నిర్దేశిస్తుంది. సమాజం సాధించిన రూప పరిణామం - నాగరికత సమాజాన్ని దిద్ది తీర్చే చైతన్య స్రవంతి - సంస్కృతి. మనిషంటే కేవలం కాళ్ళూ చేతూలూ, ఆకలీ దప్పులూ, పనిపాటలు కలిగిన జీవ యంత్రం కాదు. చైతన్యస్రవంతిలో కొత్తతీరాలను చూడాలన్నతహతహతో అనునిత్యం పురోగమించే సృజనాత్మక క్రియాశీలి. ఆ సృజనాత్మక క్రియా శీలతలో భాగంగా-చైతన్య స్రవంతి ఫలంగా - శాశ్వతంగా కొనసాగుతూ రాగలిగే విశిష్ట రూపాలనూ, కళా ప్రక్రియల్ని మానవుడు సృష్టించాడు. మానవ జాతి చరిత్రకు నిలువుటద్దం పట్టేవి శాశ్వతగుణం వున్న ఆ కళారూపాలే.

తరతరాలుగా తెలుగు జాతి ఎన్నో సాంస్కృతిక స్వరూపాల్ని, కళా ప్రక్రియల్ని ఆవిష్కరించింది. సాహిత్యం, సంగీతం, నృత్యం, శిల్పం, చిత్రలేఖనం, వంటి ఎన్నో లలిత విలాస కళల్లో నూత్న ప్రమాణాలను సృష్టించింది. నైతిక, రాజకీయ, ఆర్థిక, సామాజిక రంగాల్లో తనదంటూ ఒక విశిష్ట స్థానాన్ని సంపాదించింది. తరతరాలతెలుగు జాతి సాంస్కృతిక వైభవాన్ని స్మరించేటప్పుడు వీటన్నిటినీ వివక్షలో ఉంచుకొంటే కాని, నిండుదనం రాదు. కాని - సామాజిక - ఆర్థిక రంగాలలో వచ్చినంత వేగంగా, సాహిత్య, సాంస్కృతిక రంగాల్లో మార్పులు రావు, వీటిల్లో శాశ్వతత్వానికున్న ప్రతిపత్తి గొప్పది. మొదటివి సౌలభ్యం కోసం ఏర్పడే కట్టుబాట్లు- మార్గదర్శక సూత్రాలు. రెండవవర్గానికి సంబంధించినవి, అంటే సాహిత్య సాంస్కృతిక రంగాలకు సంబంధించినవి అలా కాకుండా, సౌందర్యంకోసం ఒకజాతి సృష్టించే ఆదర్శరూపాలు. అందుకే అవి మాత్రమే సాంస్కృతిక రంగంలో పరిశీలనలోకి వస్తుంటాయి.

ఏ సౌందర్య సృష్టికైనా 'లయ' అనేది మూలతంత్రం. ఈ లయను రెండు విధాలుగా విడదీయొచ్చు. అర్థమూ, శబ్దమూ ముడివడి ఆశ్రయించే లయ ఒకటి. అర్థం, శబ్దం అనే వాటి ఆశ్రయం కాకనే, విశిష్టమైన స్థాయిలో, శుద్ధ భావస్థాయి మనసులో

మైమరపించే లయ మరొకటి. అర్థ శబ్దాశ్రితమైన లయ సాహిత్య సృష్టికి ప్రాణం. రెండవది ఇతరకళలన్నిటికీ ఊపిరి. సాంస్కృతిక వారసత్వానికి సంబంధించిన భాండాగారంలో పై ద్విభేదంకారణం గానే రెండు ప్రధాన విభాగాలు ఏర్పడ్డాయి. మొదటిదాన్ని సాహిత్య వారసత్వం అంటాము. అది కూడా రెండవదానిలో కలగలిసి పోతున్నప్పటికీ, కొంచెం విడిగా వుంచుతూ, మిగిలిన సమస్త కళలకు సంబంధించిన వారసత్వాన్ని 'సాంస్కృతిక విభాగం' క్రింద లెక్కిస్తున్నాము. ఈనాటి వ్యవహారంలోసాంస్కృతిక కార్యక్రమాలంటే ప్రధానంగా ఏ సంగీత, నృత్య, నాటక కార్యక్రమమో అన్న అర్థం రూఢికెక్కడం ఈ కారణంవల్లనే. ప్రస్తుత వ్యాసంలో కూడా ఈ కార్యక్రమాలను నిర్వహించే సంఘాలకే ప్రాముఖ్యం వస్తోంది.

తెలుగునాట ఒకప్పుడు సంగీత, నృత్య, నాటక ప్రదర్శనలను ప్రధాన వృత్తులుగా స్వీకరించిన వర్గాలూ, కులాలు వుండేవి. దేవాలయం ఒక ధార్మిక సంస్థగానే కాకుండా, సాంస్కృతిక బృహత్సంస్థగా కూడా వర్ధిల్లింది. అంగ, రంగ భోగాలు దేవాలయాల్లో నిత్యం కొనసాగుతుండేవి. రంగ భోగం కోసం ప్రత్యేకించి దేవదాసీ వర్గం ఏర్పడింది. కాలక్రమేణ ఈ దేవదాసీ వ్యవస్థ సాంఘిక దురాచారానికి ఆలయం కావడం,అందువల్ల ఆలయంలోని రంగభోగ ప్రయోజనం కూడా దెబ్బతినడం జరిగింది. సాంఘిక మతాచారాలను రూపు మాపే ఆధునిక సంస్కరణ వెల్లువలో దేవదాసీ వ్యవస్థను పరిహరించడంకూడా జరిగింది. ఆధునిక సంస్కృతి సాధించిన ఒక మంచిలక్షణమిది. ప్రాచీనకాలంలో రసజ్ఞులైన కొందరు పండితులు, లలితకళలపట్ల ప్రత్యేక అభిరుచీ, అభినివేశం వున్నవారు ఎందరో ఈ కళలను ఆదరించారు. కొత్త కొత్త ప్రమాణాలను నెలకొల్పారు. తెలుగు జాతికే గర్వకారణమైన తీరులో కొత్తపుంతలను ఏర్పరిచారు. కూచిపూడి,నృత్యసంప్రదాయం అలాంటి విద్వత్ప్రకాండుల చేతిలో రూపుగొన్నదే. తెలుగు శబ్దానికి శాశ్వతమైన దిగంత కీర్తిని సముపార్జించిన త్యాగరాజ స్వామి, కర్ణాటక సంగీతానికి ఒక మూల స్తంభంగా ప్రకాశిస్తున్నారు. మన యక్షగానాలు దక్షిణాదిన ఎందరికో కొత్త ప్రయోగాలను నేర్పాయి. ప్రభువులూ, పండితులూ, సామాన్య ప్రజలుఅందరూ ఆదరించే ఎన్నో కళా సంప్రదాయాలు వెలశాయి. అవన్నీ మన జాతి వారసత్వంగా నిలిచాయి. వీటిని పరిరక్షించడం, పోషించడం ఇంకా క్రొత్త ప్రమాణాలు నెలకొల్పడం మనందరి విద్యుక్త ధర్మం. ఈ ధర్మం నిర్వహించడానికి రసజ్ఞులు, ఉత్సాహవంతులైన ఎందరో మహానుభావులు, యువకులు ముందుకు వచ్చి, నడుము బిగించి, శ్రమకోర్చి అనేకసాంస్కృతిక సంస్థలను నెలకొల్పారు. యథాశక్తి సాంస్కృతిక వారసత్వ వ్యాప్తికి ఎప్పటికప్పుడు చక్కని కార్యక్రమాలను నిర్వహిస్తూ, ప్రజాదరాన్ని చూరగొంటున్నారు. ప్రభుత్వం కూడా శక్తికొద్దీ వీరికి హార్దికంగా, ఆర్థికంగా తోడ్పడుతోంది. స్వయాన కొన్నిఅకాడమీలను నెలకొల్పి సేవ చేస్తున్నది. నేడు మన రాష్ట్రంలోని సాంస్కృతిక సంస్థలన్నిటినీ ఒకచిన్న వ్యాసంలో పరిచయం చేయాలను కోవడం దుస్సాహసం కనుక కొన్ని ప్రముఖమైన వాటిని మాత్రమే ప్రస్తుత వ్యాసంలో తెలుపడం జరుగుతుంది.

మొదటగా ప్రభుత్వరంగంలో జరుగుతున్న కృషిని పరిశీలిద్దాము. ఉత్సాహకరమైన సాంస్కృతిక సంఘాల కృషిని సమన్వయంచేసి వారికి తగు చేయూత నివ్వడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రత్యేకంగా సాంస్కృతిక వ్యవహారాల శాఖను 1968 లో ఏర్పరచింది. ఈ శాఖ ద్వారా, కార్యక్రమాల నిర్వహణకు, భవన నిర్మాణానికి, పరికరాల కొనుగోలుకు, ఉత్సవాలు, పోటీల నిర్వహణకు వివిధ సంస్థలకు విరాళాలిస్తున్నది. వృద్ధాప్యం మీద పడి, పేదరికంలో బాధ పడుతున్న కళాకారులకు, పండితులకు నెలసరి ఉపకార వేతనం ఇస్తున్నది. ప్రస్తుతం ఇస్తున్న నెలసరి ఉపకార వేతనం మొత్తం వందా ఏభై రూపాయలు. సమర్థులైన గ్రంథకర్తలకు వాళ్ళ పుస్తకాల ప్రచురణ నిమిత్తం గ్రాంట్లు ఇస్తున్నది. ముద్రితమైన మంచి పుస్తకాలను ఎక్కువ సంఖ్యలో కొంటూ రచయితలకు సహాయం అందిస్తున్నది. అలాకొన్న పుస్తకాలలో సగభాగం అంతర్జాతీయ తెలుగు సంస్థద్వారా రాష్ట్రం వెలుపలవున్న వివిధ తెలుగు సంఘాలకూ, పాఠశాలలకూ పంపుతున్నది మిగిలిన సగభాగం పాఠశాల విద్యా డైరెక్టరేట్ ద్వారా రాష్ట్రంలోని పలుపాఠశాలలకు పంపుతున్నది. ఆదాన, ప్రదాన పద్ధతిలో సాంస్కృతిక బృందాలను రాష్ట్రేతర ప్రాంతాలకు తరచు పంపిస్తున్నది. కళాకారులు, పండితులు ఇతర ప్రాంతాలకు వెళ్లి అధ్యయనం చేయడానికి విరాళాలిస్తున్నది. ఇవి కాకుండా ఈ శాఖ నిర్వహించాల్సిన ఇతర కార్యక్రమాలు చాలా ఉన్నాయి. ప్రతి జిల్లా కేంద్రంలోనూ సాంస్కృతిక కళా బృందాలను సమీకరించి కార్యకలాపాలకు ప్రోత్సహించడమూ, రంగస్థల నిర్మాణాలను ప్రోత్సహించడమూ, కళారంగానికి సంబంధించిన వివిధ వస్తువులను భద్రపరిచే ప్రదర్శనశాలల నిర్మాణానికి ప్రోత్సాహమివ్వడమూ, కళాసంస్కృతులపై ఉపన్యాసాలిప్పించటమూ వంటి ఆదర్శమైన కార్యక్రమాలు ఆచరణలోకి రాకుండా మిగిలిపోయాయి. దీనికి కారణం నిధులకొరతే. ఈ సంవత్స

రమే ఇదివరకటి కంటె కొంత ఎక్కువ మొత్తంలో ప్రభుత్వం ఈ శాఖకు నిధులు కేటాయించింది. నాటకశాలల అభివృద్ధి కొరకు ఒక డైరెక్టర్‌నుకూడా నియమించింది. కాని ఈ మాత్రమే చాలదు. ఇంకా నిధులు పెంచాల్సిన అవసరం ఉంది. అలాగే సెక్రటేరియట్ వెలుపల ఒక సాంస్కృతిక వ్యవహారాల డైరెక్టరేట్‌ను ఏర్పరచాల్సిన అవసరమూవుంది. అప్పుడే ఆశించిన ప్రయోజనాలు సిద్ధించగలవు.

ప్రభుత్వ రంగం నుంచి లభిస్తున్న సహాయ సహకారాలలోనూ, జరుగుతున్న కృషిలోనూ మరొక ముఖ్యమైన భాగం అకాడమీల స్థాపన. కేంద్రప్రభుత్వం న్యూఢిల్లీలో స్థాపించిన సాహిత్య అకాడెమీ, సంగీత నాటక అకాడెమీ, లలిత కళా అకాడెమీలు నమూనాలో వాటి అనుబంధ సంస్థలుగా వివిధ రాష్ట్రాలలో కూడ భిన్న అకాడెమీలు అవతరించాయి. ఆంధ్ర ప్రదేశ్‌లో సాహిత్య అకాడెమీ, సంగీత నాటక అకాడెమీ 1957 లో స్థాపిత మయ్యాయి. తెలుగు సాహిత్యం అభివృద్ధి కొరకు వెలసిన సాహిత్య అకాడెమీ చక్కటి కార్యక్రమాల ద్వారా అనుకొన్న లక్ష్యాలను సాధించడంలో విజయవంతం అయింది. ప్రాచీన సాహిత్యానికి సంబంధించిన గ్రంథాలను సప్రమాణంగా అచ్చొత్తించి చౌకధరలలో లభింప చేసింది. దేశంలో ఇంకే అకాడెమీ చేపట్టని కొన్ని మౌలిక పరిశోధనాత్మక గ్రంథాల ప్రచురణను చేపట్టింది. రచయితలకు సహాయాన్ని అంది స్తున్నది. వివిధ ప్రక్రియలలో ఉత్తమ రచనలకు ఏటేటా బహుమతులిస్తున్నది. రచయితలకు ప్రత్యేక బహుమతులిస్తూ వారి కోసం ప్రత్యేక సభలను నిర్వహిస్తూ, ఉత్తేజపరుస్తోంది. ప్రతి సంవత్సరం పరిశోధన విలువలున్న శీర్షికలను ఎన్నుకొని వాటిపై పోటీలు ఏర్పాటుచేసి ఉత్తమ రచనలకు బహుమతు లిస్తోంది. ఇతర ప్రాంతాలకు వెళ్ళి సాహిత్యాధ్యయనం చేయాలనుకొన్న రచయితలకు, ఆర్థిక సహకారాన్ని అందిస్తుంది. దేశంలోని అనేక ఇతర అకాడెమీలు తాము ముద్రించిన పుస్తకాలను విక్రయించే విషయంలో దెబ్బతిన్నాయి కాని, ఆం. ప్ర. సాహిత్య అకాడెమీ మాత్రం అందులో విజయవంతమై ఆర్థిక పటిష్టతను సాధించుకొంది.

1957 లోనే సంగీత, నాటక అకాడెమీ వెలసింది. నాటకం అనే మాటలో నృత్యం కూడా అంతర్లీనమై వుంది కనక, సంగీత, నృత్య, నాటకాల అభివృద్ధి కొరకై ఈ సంస్థ అవతరించింది. మొదట్లో చాలా ఉత్సాహవంతంగా పనిచేస్తూ ఎన్నో ఆదర్శ వంతమైన కార్యక్రమాలను రూపొందించింది. లక్షణ శాస్త్రానికి సంబంధించిన అరుదైన ప్రతుల్ని సేకరించి, జనరంజకంగా ప్రచురించింది. ప్రముఖ కళాకారుల మీద, రచయితల మీద గ్రంథాలను ప్రకటించింది. నాట్యకళ అనే పత్రికను బహుకాలం నడిపింది. ఒకప్పుడు స్వంత ముద్రణాలయాన్ని కూడా ఏర్పరచుకొంది. దాని నిర్వహణలో నష్టంరావడం మూలంగా మూసివేసింది. రాష్ట్రంలో పలు ప్రాంతాలలో ఏర్పడిన సంగీత సంస్థలను, నాటక సంస్థలను అనుబంధ సంస్థలుగా గుర్తిస్తూ, వాటికి కొంత ఆర్థిక సహకారాన్ని కూడా అందించింది. కొంత మంది నృత్యకళాకారిణులను ఎంపిక చేసి వారి ప్రదర్శనలను ఏర్పాటు చేసి సహాయ సహకారాలనిస్తున్నది. ఒకప్పుడు నాటక శిక్షణ తరగతులను కూడా నిర్వహించింది. ప్రత్యేకమైన నాటక శిక్షణా కేంద్రాన్ని స్థాపించాలని ఆశించింది. కాని, నిధుల కొరత మూలంగా నెరవేరలేదు. అలాగే జానపద రంగానికి సంబంధించిన కార్య క్రమాలు కూడా విస్తరించ లేదు.

నిధుల అభావం కొంతా, బహురంగ విస్తృతి కొంతా సంగీత నాటక అకాడెమీ ఆశించిన లక్ష్యాలను అధిగమించలేక పోవడానికి కారణభూతమయ్యాయి. అకాడెమీ ఉద్దేశాల వ్యాప్తిని దృష్టిలో ఉంచుకొని ఇటీవలే ప్రభుత్వం ఈ అకాడెమీని విభజించి సంగీత, నృత్య, నాటకాలకు ప్రత్యేకంగా మూడు అకాడెమీలను నెలకొల్పింది. నిధులను పెంచింది. ఇకముందు ఈ రంగాలలో ఇతోధిక చైతన్యం రాగలదని ఆశించవచ్చు. జానపద కళల నిమిత్తం ప్రత్యేకంగా ఒక అకాడెమీ రావాలని కొందరు పెద్దలు అభ్యర్థించారు కాని, పై మూడింటి పరిధిలోనే జానపద కళలు అంతర్లీనమై వుంటాయి కనుక విడిగా వాటికోసం ఒక అకాడెమీ ఏర్పడలేదు. అయితే తమకు లభించిన నిధులలో విధిగా కొంత భాగము జానపద కళల అభివృద్ధికి పైమూడు అకాడెమీలు ఖర్చు చేయాలని నిర్దేశక సూత్రం ఏర్పడింది.

సాహిత్య, సంగీత నాటక అకాడెమీల అనంతరం ఆం. ప్ర. లలిత కళా అకాడెమీ స్థాపన జరిగింది. చిత్రలేఖనం శిల్పం వంటి రూపకళల అభివృద్ధికి లలితకళా అకాడెమీ అంకితమైంది లలిత కళలన్న మాట సాధారణంగా కళలన్నిటికీ అనువర్తిస్తుంది. దీనిని రూపకళా అకాడెమీ అంటు వ్యవహరించమని కొందరు విజ్ఞులు సూచించారు కూడా.

శిల్పం, చిత్ర లేఖనాలను ప్రోత్సహించే వివిధ సంస్థలను రాష్ట్ర వ్యాప్తంగా లలిత కళా అకాడెమీ గుర్తించింది. తన అనుబంధ సంస్థలుగా స్వీకరించింది. తనకు వస్తున్న తగు మాత్రపు నిధుల్లో నుంచే కొంత విరాళాన్ని అందిస్తున్నది. చక్కటి చిత్ర కారుల నుంచి చిత్రాలను కొంటూ ప్రోత్సాహ

పరుస్తున్నది. ప్రదర్శనలను ఏర్పాటు చేసే వీలున్న హాలు ఈ అకాడెమీకి కళాభవన్ ప్రాంగణంలో ఉంది. చిత్ర కళకు ప్రాధాన్యమున్న ప్రదర్శనాలను నిర్వహించేటందుకు ఈ హాలును అద్దెకిస్తుంది కూడా. జిల్లా ప్రదర్శన శాలలను కూడా ఏర్పాటు చేయాలన్న గొప్ప సంకల్పం నిధుల కొరత మూలంగా ఆచరణలోని రాక పోయింది. శిల్పకళ అభివృద్ధి కార్యక్రమం కూడ అందువల్లె కుంటుపడింది. ఇప్పుడిప్పుడే ఈ అకాడెమీ నిధుల హెచ్చింపు జరిగినందువల్ల ఇక అవి త్వరితంగా ఆచరణలోకి వస్తాయని ఆశించవచ్చు.

ఇవి కాకుండా ఆంధ్రప్రదేశ్‌లో ఇంకొక రెండు ప్రత్యేక అకాడెమీలు ఉన్నాయి. ఫోటోగ్రఫీ అకాడెమీ, బాలల అకాడెమీ. దేశం మొత్తం మీద ఇటువంటి అకాడెమీలను స్థాపించడంలో ఆంధ్రప్రదేశ్‌దే తొలిస్థానం. అరవైలలో జరిగిన ఒక సదస్సు ఫలితంగా ఛాయాచిత్రణం కూడా ఒక విశిష్టకళే అనీ, ఆకళకు సంబంధించిన ప్రతిభావంతులను సంఘటితపరచి ప్రోత్స హించాల్సిన బాధ్యత ఉన్నదనీ, రాష్ట్రప్రభుత్వం ఆం. ప్ర. అకాడెమీ ఆఫ్ ఫోటోగ్రఫీని స్థాపించింది. అలాగే పిల్లల్లోని సృజనాత్మక ప్రతిభను పెంపొందించేటందుకు, కళారంగంలో వారికున్న శక్తినీ, ఆసక్తినీ సుశిక్షితం చేసేటందుకు బాలల అకాడెమీ స్థాపన 1976లో జరిగింది. ప్రతిఏటా రాష్ట్ర స్థాయిలో ప్రతిభా పాటవ పోటీలను ఈ అకాడెమీ ఏర్పాటు చేస్తుంది. సంగీతం, నృత్యం, నాటకం వంటి ప్రదర్శనాత్మక కళల్లోను కవిత్వం, చిత్రలేఖనం, ఛాయ చిత్రణ వంటి భావరూపాత్మక కళల్లోనూ మొదట జిల్లా స్థాయిలోనూ. తర్వాత రాష్ట్ర స్థాయి లోను ఈ పోటీలు ఉంటాయి. బాలబాలికల కళా ప్రతిభను వెలికి తెచ్చేటందుకు, పెంపొందించేటందకు ఇదెంతో సహాయకారిగా ఉంటుంది. దీంతోపాటు వారి మానసికవికాసానికి రోహదం చేసే అనేక సంకలనాలను, పుస్తకాలను అకాడెమీ ప్రచురిస్తోంది. 'బాలచంద్రిక' అనే మాసపత్రికను కూడ ప్రక టిస్తోంది. తెలుగు దేశంలోని పల్లె పల్లెలో వున్న ప్రతి చిన్న పాఠశాలకు వెళ్ళుతున్న ఏకైక మాస పత్రిక బాల చంద్రికే. కేవలం కథలు, కవితలు వంటి ఉల్లాసకర రచనలకే కాకుండా వైజ్ఞానిక దృష్టిని పెంపొందించే అనేక శాస్త్రీయ విషయాలకు కూడా ఈ పత్రికలో ప్రాధాన్యం ఉంటుంది. బాలల విజ్ఞానం, వినోదం, వికాసం, ఈ అకాడెమీ ఆశయాలు. బాల బాలిక లకు తెలుగు దేశాన్ని పరిచయం చేస్తూ అకాడెమీ నిర్మించిన "ఆంధ్ర ప్రదేశ్ దర్శన్" రంగుల చిత్రం అందర్నీ ఆకర్షించింది.

సాంస్కృతిక రంగానికి ప్రధాన బాధ్యత వహించే లాగ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం స్థాపించిన మరో సంస్థ అంతర్జాతీయ తెలుగు సంస్థ. రాష్ట్రంలోని తెలుగు ప్రజల భాష సాంస్కృతిక అవసరాల నిమిత్తం, సాంస్కృతిక వ్యవ హారాలశాఖ, సెకండరీ విద్యాశాఖ, ప్రచార పౌరసంబంధాలశాఖ, వివిధ అకాడెమీలు నిర్వహించే సేవలను రాష్ట్రం వెలుపల వున్న కోటిన్నర మంది తెలుగు ప్రజానీకం కోసం ఈ సంస్థ సమన్వయ పరుస్తూ, వారి విద్యా సాంస్కృతిక అవసరాలను తీర్చటంలో కృషి చేస్తున్నది. తెలుగు అధ్యయనాలకు సంబం ధించిన ఒక కేంద్ర పరిశోధనా సంస్థగా, అన్ని ప్రాంతాలలోని తెలుగు ప్రజల మధ్య సమైక్యతను, సాంస్కృతిక సత్సంబం ధాలను పటిష్ఠ పరిచే ఒక విశిష్ట సాంస్కృతిక సంస్థగా, ఈ అంతర్జాతీయ తెలుగు సంస్థను మొదటి ప్రపంచ తెలుగు మహా సభల అనంతరం వాటి పర్యవసానంగా, స్థాపించడం జరి గింది. కాని ఇంతటి ఉన్నతాశయాల సిద్ధికి, రాష్ట్ర ప్రభుత్వం ఈ సంస్థకు కేటయించిన నిధులు చాలా స్వల్పం అందువల్లనే ఈ సంస్థ ఆశించినంత శీఘ్రగతిలో, విస్తృత రీతిలో పురోగ మించలేక పోతోంది. రాష్ట్ర రాష్ట్రేతర ప్రజల మధ్య సాంస్కృ తిక సత్సంబంధాలను పెంపొందించడంలోను, రాష్ట్రేతర ప్రాంతాలలో తెలుగు సంఘాలకు ఆర్థిక సహాయాన్ని, గ్రంథా లయ సహాయాన్ని, ఉన్నత విద్యారంగంలో సీట్ల రిజర్వేషన్ వంటి సౌకర్యాలను అందించడంలో సంతృప్తికరమైన సేవలు చేసింది. సంఖ్యలో తక్కువైనా, ఈ సంస్థ ప్రకటించిన పుస్త కాలు గుణంలో గొప్పవి. తెలుగు అధ్యాపకులకు. భాషా బోధనలో ఈ సంస్థ నిర్వహించే శిక్షణ తరగతులు, భాషా బోధన రంగంలోనే ఒక కొత్త ప్రయోగం.

ఇవే కాకుండా సైన్స్ అకాడెమీ, తెలుగు, ఉర్దూ అకాడెమీ, సంస్కృత అకాడెమీ వంటివి మరి కొన్ని సంస్థలు ప్రభుత్వ సహకారంతో నడుస్తున్నాయి. కానీ ఇవి ప్రధానంగా భాషా, విద్యారంగాలకు సేవచేస్తున్నట్టివేకాని, కళాసాంస్కృతిక రంగాలకి కాదు. భాషా సాహిత్య రంగాలలో కృషిచేస్తున్న స్వచ్ఛంద సంస్థలలో ఈ రోజు హైదరాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తు వారిదే అగ్రస్థానం. నిజాం పాలనలో తెలుగు భాషా, సంస్కృతులను అణిచి వేయడానికి అతిదుర్మార్గమైన ప్రయ త్నాలు జరుగుతున్నప్పుడు, వాటిని ఎదిరించి తెలుగు భాషా పరిరక్షణకు, తెలుగు జాతి స్వాతంత్ర్యానికి నడుము కట్టిన మహానుభావుల సేవా ఫలితంగా సారస్వత పరిషత్తు అవత రించింది. ఇప్పటికి కూడా చక్కటి సాహిత్య సాంస్కృతిక

కార్యక్రమాలను నిర్వహిస్తున్నది. ముంగిటలో కాకతీయ శిల్పవైభవాన్ని రూపు గట్టించే లాగ నిర్మితమైన సారస్వత పరిషత్తుహాలు, రాష్ట్ర రాజధానిలో అనునిత్యం అనేక సాంస్కృతిక కార్యక్రమాలకు నిలయం వేదిక.

కళా సంస్కృతులకు భాగ్యనగరంలో వేదిక సమకూరుస్తున్న మరొక సంస్థ రవీంద్ర భారతి. ప్రభుత్వ యాజమాన్యంలో నడుస్తున్న థియేటర్. దీన్ని కేవలం ప్రదర్శనాలయంగా మాత్రమే కాకుండా, ప్రదర్శన కళలలో శిక్షణనిచ్చే ఒక కేంద్ర సంస్థగా తీర్చిదిద్దాలని ప్రభుత్వం సంకల్పించింది. అందుచే మేనేజర్ పోస్టు స్థానంలో డైరెక్టర్ పోస్టులు ఏర్పరచింది. కాని ఎందుకో ఆ కార్యక్రమం మాత్రం ఆచరణలోకి రాలేక పోయింది. సాంస్కృతిక ప్రదర్శనలకు భాగ్యనగరంలో వేదికలౌతున్న మరొక రెండు రంగస్థలాలు ప్రియదర్శిని ఆడిటోరియం, త్యాగరాయ గానసభ. రాష్ట్ర ప్రభుత్వ యాజమాన్యంలోని జవహర్ బాలభవన్ నిర్వహణలో వున్నది ప్రియదర్శిని ఆడిటోరియం. బాలలలోని సృజనాత్మక ప్రతిభా వికాసానికి కృషి చేస్తున్న సంస్థ బాలభవన్. వివిధ లలిత కళల్లోను, చేతి పనుల్లోను, పిల్లలకు పాఠశాలేతర సమయాల్లో శిక్షణ తరగతులను నిర్వహిస్తోంది. పిల్లల మానసిక వికాసానికి కృషిచేస్తుంది. త్యాగరాయ గానసభ ప్రసిద్ధులైన కళా సేవకులతో నడుపబడుతోంది. రవీంద్ర భారతి తర్వాత నగరంలో పెద్ద రంగశాల ఈ సభ వారిదే. ప్రతి ఏడూ ప్రసిద్ధ కర్ణాటక, హిందుస్తానీ, సంగీత విద్వాంసులను ఆహ్వానించి సాంప్రదాయిక నాటకాలతో పాటు వారోత్సవాలు జరుపుతుంటుంది. స్థానిక సాంస్కృతిక సంస్థలెన్నో క్రమం తప్పక నిత్యం సభలో కార్యక్రమాలు ఏర్పాటు చేస్తుంటారు.

రాష్ట్ర స్థాయిలో నాటక రంగానికి సంబంధించి విశిష్ట స్థానాన్ని సంపాదించింది ఎ. పి. నాట్య సంఘం. సంగీత నాటక అకాడెమీ అవతరణకు ముందు నుంచే ఈ సంఘం రాష్ట్ర స్థాయిలో ఔత్సాహిక నాటక సంఘాలను సంఘటిత పరచడానికి కృషి చేసింది. పలు జిల్లాల్లో దీని శాఖలు విస్తరించాయి. రాష్ట్ర వెలుపల కూడా ఈ సంఘానికి అనుబంధంగా పనిచేసిన సంఘాలున్నాయి. దీనికి ప్రధాన సారథి ప్రసిద్ధ నటుడు, ప్రయోక్త శ్రీ ఎ. ఆర్. కృష్ణ. కృష్ణగారి సారథ్యంలోనే నడిచే మరో సంస్థ నవరసనటబృందం. పిరుప్రయోగాత్మకంగా రూపొందించి ప్రదర్శిస్తూ మంచి పేరు తెచ్చుకొన్న ఇటీవలి నాటకం మాలపల్లి. దీన్ని జీవ నాటక ప్రయోగ పంధాలో రూపొందించారు. ఒకప్పుడు నాటక కళ మీద కొన్ని ప్రత్యేక సంచికలను వెలువరించింది. నాట్య సంఘం నటనా శిక్షణాలయాన్ని కూడా నిర్వహించింది గత కొన్నేళ్లుగా 'మాలపల్లి' 'ప్రతాపరుద్రీయం' వంటి మంచి నాటకాల ప్రదర్శనలను 'నవరస నటబృందం' పక్షాన చేపట్టడం తప్ప మిగిలిన కార్యక్రమాలను మునుపటంతటి ఉత్సాహంతో చేపట్టడంలేదు. చక్కటి జాతీయ సంస్థగా ఎదగాల్సింది, కుంటుపడింది.

ఇలాగే మరో ప్రసిద్ధ సాంస్కృతిక సంస్థ ఇండియన్ నేషనల్ థియేటర్స్, చక్కటి అభిరుచి, నిర్వాహణ సామర్థ్యం ఉన్న కొందరు పెద్దలతో ఈ సంస్థ కనబడుతోంది. రెండు దశాబ్దాల పైబడి సేవా చరిత్ర ఉన్న ఈ సంస్థ అనేకమైన చక్కని నాటికలను, నాటకాలను రూపొందించి, అందించింది. రాష్ట్రేతర ప్రాంతాలలో కూడ పర్యటించి, ప్రదర్శనలిచ్చింది. అలానే ఆర్. వి. చలం వంటి ఇతర ప్రాంత కళాకారులను కూడా ఆహ్వానించి ప్రదర్శనలు ఏర్పాటు చేసింది నెలనెలా కార్యక్రమం పేరిట అనేకమైన హాస్య రచనలను ప్రయోగాత్మకంగా ప్రదర్శిస్తున్నది. కేవలం రాజరాజధాని నగరంలోనే కాకుండా రాష్ట్రమంతటిలోనూ చెప్పుకోదగ్గ మంచి సంస్థ ఐ. ఎన్. టి. దీంట్లో బాలల విభాగం కూడా ఉంది. ఈ సంస్థలాగే ఇటీవలి రాష్ట్రేతర ప్రాంతాలలో కూడా ప్రదర్శనలిచ్చి మంచిపేరు తెచ్చుకొన్న సంస్థ — సనత్‌నగర్ కల్చరల్ అసోసియేషన్. ఈ సంఘంవారి 'సత్యం వద-ధర్మంచెర' పలు రాష్ట్రేతర తెలుగు సంఘాలకు పరిచయమే.

బాలల రంగస్థల కౌశలానికి సంబంధించి గొప్ప కృషి చేసిన సంస్థ-ఆంధ్ర బాలానంద సంఘం. ఇదికూడా రాష్ట్ర స్థాయిలో మిగిలిన బాలానంద సంఘాలతో సమైక్యత సాధించి, మార్గదర్శకంగా ఉన్నది. దీని సారథులు రేడియో అన్నయ్య శ్రీన్యాయపతి రాఘవరావుగారు, ఇటీవల కాలధర్మం చెందిన వారి సతీమణి రేడియో అక్కయ్య శ్రీమతి కామేశ్వరిగారు. వీరికి మంచి థియేటర్ ఉంది. ఎందరో పిల్లలకు రంగస్థల కళల్లో శిక్షణనిస్తూ ప్రదర్శనలు ఏర్పాటు చేస్తుంటారు.

రంగస్థల కళల ప్రాచుర్యంలో చెప్పుకోదగ్గ కృషి చేస్తున్న మహామంచి సంస్థ కళాసాగరం. రాష్ట్ర విభజన పిమ్మట మద్రాసులో ఉన్న కళాసాగరానికి మారుగా హైదరాబాదులో రైల్వే ఉద్యోగులు స్థాపించిన సంస్థ ఇది. 'ప్రతినెలా

ఒక కార్యక్రమం' అనే ప్రాతిపదికమీద శాశ్వత సభ్యులను చేర్చుకొంటుంది. అప్పుడప్పుడు ప్రసిద్ధ సంగీత విద్వాంసులను కూడా ఆహ్వానించి కార్యక్రమాలు ఏర్పాటు చేస్తుంటుంది. హైదరాబాదు నగరంలో ఉద్యోగుల బృందాలు ఏర్పరుచుకొన్న సాంస్కృతిక సంఘాలు చాలా చక్కగా, పటిష్టంగా కార్యక్రమాలు నిర్వహిస్తుంటాయి. అలాటి వాటిలో మొదటగా చెప్పుకోదగింది సెక్రటేరియట్ కల్చరల్ అసోసియేషన్. ఇది దాదాపు రెండు దశాబ్దాల పైబడిన సేవా చరిత్రను కలిగి నట్టిది. ఒకప్పుడు ఎంతో చక్కని ఆర్థిక సౌష్ఠవాన్ని కలిగి వున్న సంస్థ. సీనియర్ హోదాలో ఉన్న ఉద్యోగులు కూడా ఒకప్పుడు ఈకార్యక్రమాలలో పాల్గొంటూ, దీనికి మంచి స్థాయిని సంతరించారు. ఇటీవల సీనియర్ ఉద్యోగులు పాల్గొనడం కొంత తగ్గినప్పటికీ, ప్రతిఏడూ మంచి కార్యక్రమాలను ఏర్పాటుచేస్తూ పోటీల్లో పాల్గొంటూ బహుమతులు సంపాదించుకొంటూ తనస్థాయిని నిలబెట్టుకొంటోంది. ఎల్.ఐ.సి. ఉద్యోగులు, విద్యుత్‌సౌధలోని ఉద్యోగులు, ఎ.జి. ఆఫీసులోని ఉద్యోగులు ఇరిగేషన్‌శాఖలోని ఉద్యోగులు స్థాపించిన సంఘాలు చాలా ఉత్తమ కార్యక్రమాలను అందించాయి. దాదాపు ప్రతినెలా, అటుసాహిత్య కార్యక్రమాలలో, ఇటుసాంస్కృతిక కార్యక్రమాలనుకూడా ఏర్పాటు చేస్తున్నాయి. ఐ.డి.పి.ఎల్, బి.హెచ్ ఇ.ఎల్; హెచ్.ఎ.ఎల్, వంటిపెద్దపెద్ద పరిశ్రమలలో కూడా సాంస్కృతిక సంస్థలు వెలసికూడా ఆదర్శవంతంగా పనిచేస్తు ఇటు, ఐ.డి.పి.ఎల్. వారుఅంతర్సంఘాల నాటకపోటీలను కూడ ఏర్పాటు చేస్తుంటారు. పోస్టల్ అండ్ టెలిఫోన్స్ డిపార్టుమెంటులోని వారుకూడా ప్రతిఏడూ అంతర్సంఘాల నాటక పోటీలు ఏర్పాటు చేస్తుంటారు. మంచి మౌలికమైన రచనలు, ఉద్యోగులు రచించిన, ఈ కార్యక్రమాల మూలంగా వెలికి వచ్చాయి. ఇతర స్వచ్ఛంద సంస్థల్లో అనేకం సామాజిక నాటకాలను ప్రయోగించేవే. సాంప్రదాయిక నాటకాల ప్రదర్శన కోసం కృషి చేస్తున్న సంస్థల్లో గణనీయమైనది శ్రీరామ భక్త కళాసమితి. దాదాపు పధ్నాలుగేళ్ళ నుండి పాదుకా పట్టాభిషేకం కురుక్షేత్రం, కాళిదాసు, శ్రీవేమన వంటి మంచి నాటకాలను విశిష్టమైన క్రమశిక్షణతో, ఒద్దికతో ఈ బృందం ప్రదర్శిస్తున్నది. ఇతర ప్రాంతాలలో కూడా అనేక ప్రదర్శనలు ఇచ్చింది. నగరంలో సాంప్రదాయిక నాటకాలంటే మొదటి పీట వీరిదే. ఈ సంస్థ వెన్నెముకల్లాగ కృషి చేస్తున్నవారు శ్రీ జి. ఎస్. ఎన్. శాస్త్రి, శ్రీ వి. కె. రాధా. ఆ తర్వాత గణనీయమైంది ప్రముఖ నటుడు సి. ఎస్. ఆర్. పేరిట వెలసిన సి. ఎస్. ఆర్. కళా మందిర్.

ఉత్సాహవంతులైన యువకులు కలిసి స్థాపించిన సంస్థలు వంశీ ఆర్ట్స్, కిన్నెరా ఆర్ట్స్ అతి తక్కువ కాలంలో నగరంలో ప్రముఖ కళా సంస్థలుగా పేరు తెచ్చుకొన్నాయి. సాంస్కృతిక రంగానికి వివిధ కార్యక్రమాలను పెద్ద ఎత్తున ప్రతినెలా జరుపుతుంటాయి. కిన్నెర ఆర్ట్స్ సంస్థ ఇటీవలనే స్థాపితమైనా, నెల నెలా వినోదం పేరిట భారీఎత్తున కార్యక్రమాలు జరుపుతూ గొప్ప పేరు తెచ్చుకొంది. కొన్ని మంచి ప్రచురణలు కూడా వెలికి తెస్తోంది.

నృత్య రంగానికి సంబంధించి, ప్రసిద్ధ నృత్య కళాకారులు శ్రీ నటరాజ రామకృష్ణ స్థాపించిన 'పేరిణి ఇంటర్నేషనల్' కు ప్రత్యేక స్థానం వుంది. కాకతీయుల కాలంలో వెలసి ప్రాభవాన్ని అనుభవించి, కడకు వరంగల్లు రామప్ప గుడి గోడల మీద నిలిచి పోయిన పేరిణి నృత్యానికి, అపరిమిత పరిశోధన చేసి, మళ్ళీ ప్రాణం పోసి ప్రాచుర్యానికి తెచ్చారు రామకృష్ణ. ఎందరికో శిక్షణనిస్తూ పేరిణిని సజీవ కళగా చేశారు. ప్రసిద్ధ నృత్య కళాకారిణి శ్రీమతి సుమతీ కౌశల్ స్థాపించిన నృత్యశిఖర, శ్రీ భాగవతుల నృత్యాలయ కూడా నగరంలో గుర్తింపును పొందిన విశిష్ట నృత్య కళాలయాలు. ఇటీవలే మద్రాసు వెంపటి చినసత్యంగారి కూచిపూడి ఆర్ట్ అకాడెమీ శాఖామందిరం అదే పేరిట కుమారి శోభానాయుడు ప్రిన్సిపాలుగా వెలసి అందర్నీ ఆకర్షించింది. ఇవన్నీ ప్రధానంగా శిక్షణాలయాలు. విజయనగర్ అసోసియేషన్ వారి దృష్టి ప్రధానంగా నృత్యం మీదనే. శ్రీ గోపాల రాజ్‌భట్ గారి ఆధ్వర్యంలో నడుస్తున్న సంఘం జానపద నృత్యాలలోనూ, జానపద గీతాలలోనూ కూడా కొత్త పంథాలను సృష్టించి అందర్నీ అపరిమితంగా ఆకర్షించింది. ఇందులోని కళాకారులు ప్రధానంగా సంగీత నృత్య కళాశాలల్లోని వారై ఉంటారు. రాష్ట్ర మంతటా సంగీత నృత్య కళాశాలలు. సాంస్కృతిక సంపదకు జీవ భాండాగారాల్లాగా ఉంటూ, వాటి వ్యాప్తికి మిక్కిలి కృషి చేస్తున్నాయి.

అలాగే వీటి వ్యాప్తికి, ముఖ్యంగా సంగీత వ్యాప్తికి ప్రముఖ దేవస్థానాలు చేస్తున్న కృషి కూడా గణనీయమైంది. తిరుమల తిరుపతి దేవస్థానం వారు అన్నమాచార్యుల కృతులను అనేకం రాగ తాళ బద్ధంగా పూజ్యులు కీ. శే. రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మ గారి వంటి ప్రసిద్ధ పండిత ప్రకాండుల పరిశోధనా ఫలంగా వెలికి తెచ్చారు. ప్రత్యేకించి అన్నమాచార్యుల పేరిట ఒకపరిశోధనా పీఠాన్ని నెలకొల్పారు. ప్రస్తుతం

దీనికి ప్రత్యేకాధికారిగా 'ఆంధ్ర వాగ్గేయ కారులు' గ్రంథ కర్త, సంగీత సాహిత్యాలలో సవ్యసాచి శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు గారు పని చేస్తున్నారు. శ్రీమతి సుబ్బలక్ష్మి వంటి గాన సరస్వతిని ఆస్థాన విద్వాంసురాలిగా గౌరవించారు. ఈ సంప్రదాయాన్ని మరికొన్ని దేవాలయాలు కొన్ని పాటి స్తున్నాయి. ఇటీవలే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కూడా ఇది వరకు ఉన్న ఆస్థాన కవి పదవిలాగా ఆస్థాన సంగీత విద్వాంసుల పదవులను కూడా నెలకొల్పి వాటితో శ్రీమంగళంపల్లి, శ్రీ ఈమని గార్లను సత్కరించారు. నృత్యానికి కూడా ఇలాటి గౌరవమే ఇవ్వవలసిన అవసరం ఎంతైనా ఉంది.

మిగిలిన జిల్లాల్లో పని చేస్తున్న సాంస్కృతిక సంస్థల వద్దకు వచ్చేసరికి విజయనగరం - నటరాజ కళాసమితికి ప్రత్యేక స్థానం వుంది. కాళరాత్రి, ఫణి, కన్యాశుల్కం వంటి నాటకాలను అనేక పర్యాయాలు ప్రదర్శించి మంచి పేరు తెచ్చుకొన్న సంస్థ ఇది. ఇది వరకు కన్యాశుల్కం ప్రదర్శనను మూడు వందల పర్యాయాలకు పైగానే ఇచ్చారు. నాగభూషణం గారి రక్తకన్నీరు తప్ప, సాంఘికాల్లో ఇన్ని ప్రదర్శనాలు ఇచ్చిన నాటకం కాని, నాటక సంఘం కానీ చాలా అరుదు. దీనికి వెన్నెముక సినిమా నటుడు శ్రీ జె. వి. రమణమూర్తి గారి అనుభవం, శిల్పపరిజ్ఞానం. శంకరాభరణం ద్వారా అందర్నీ ఆకర్షించిన శ్రీ సోమయాజులు గారు ఇందులో తర్వాతి ముఖ్యులు. ప్రదర్శన బాహుళ్యంతో పాటు, ప్రయోగ వైవిధ్యం, ఆధునికత అనే అంశాలను పరిగణనలోకి తీసి కొంటే ఆంధ్ర విశ్వ విద్యాలయంలోని థియేటర్స్ డిపార్ట్‌మెంట్ ప్రప్రథమ స్థానాన్ని ఆక్రమిస్తుంది. దీనికి జీవనాడి ప్రస్తుతం శ్రీ అత్తిలి కృష్ణ. ఇటీవల వారు రూపొందించిన ఉరేగింపు గొప్ప ఆధునిక నాటకం. అందరికి సుపరిచితులు, సువర్ణ కంకణ, కిరీటాది విశిష్ట బహుమతి గ్రహీత, కృష్ణ పాత్రతో అపార ఖ్యాతి నార్జించిన వారు శ్రీపీసపాటి నరసింహమూర్తి తెనాలి ఆర్టిస్ట్స్ అసోసియేషన్ పేరిట అనేక సాంప్రదాయిక నాటకాలను ప్రదర్శించారు. గుంటూరులోని 'సాహితీ ఆర్ట్స్ థియేటర్స్', నెల్లూరులోని 'రామకృష్ణ నాట్యమండలి' చిత్తూరులోని 'శ్రీరామ విలాస సభ', కడపలో 'శోభాకళా మందిర్', అనంతపురంలో 'లలిత కళా సమితి', నల్గొండ జిల్లా రేపాలలోని 'గ్రామ వెలుగు నాట్యమండలి', రాజమండ్రి లోని 'రాఘవ కళా సమితి', విజయవాడలోని 'రసన సమాఖ్య', భీమవరం 'అంకాల ఆర్ట్ అకాడెమీ', ఏలూరులో 'తెలుగు దర్బారు', కృష్ణాలోని వెల్లటూరులో 'నవరంగ్ చిత్ర కళానికేతన్' రాష్ట్రమంతటిలోనూ సుప్రసిద్ధ సంస్థలుగా పేరు పొందాయి. చిత్తూరు శ్రీరామ విలాస సభ స్వాతంత్ర్యో ద్యమకాలంలో పుష్పించిన ప్రసూనం. శ్రీచిత్తూరు నాగయ్య వంటి మహోత్తమ కళాకారుని సేవలు స్వీకరించిన సంస్థ. శ్రీరామకృష్ణ రాజు వంటి ప్రముఖుల సేవలతో ప్రవర్ధమాన మైన రంగ క్షేత్రం. అయితే ప్రస్తుతం నిస్తబ్ధత పాలయింది. రాజమండ్రి రాఘవ కళా సమితి వీరేశలింగం గారి ప్రహసనాలూ, నాటకాలూ ప్రదర్శించడానికి ప్రారంభమై, తర్వాత తర్వాత వివిధ చారిత్రక, పౌరాణిక, సాంఘిక నాటకాలను ప్రదర్శిస్తూ పేరులోకి వచ్చింది. తెలుగు నాట రంగస్థల దీపంగా వెలిగిన డాక్టర్ రాజారావు గారు ఒకప్పుడిందులో సభ్యులు.

స్వచ్ఛంద సంస్థ లన్నిటిలోకి మణిపూసలాగా వెలుగు తున్నది ప్రజానాట్యమండలి. ప్రజలను అభ్యుదయ భావాల పట్ల, హేతువాద దృక్పథం పట్ల చైతన్యవంతం చేయడానికి వెలసిన సాంస్కృతిక సంస్థ ఇది. దీనికి చాలా శాఖలు కూడా ఉన్నాయి. దీన్ని నడుపుతున్న వాళ్ళకు కమ్యూనిష్టు భావాలపట్ల నిబద్ధత వుంది. ప్రజలను జాగృత పరచడమే తమ లక్ష్యంగా పెట్టుకొని, అనేక పట్టణాల్లో ఉత్తమ నాటకాలను ప్రదర్శించింది. తెలుగుదేశంలో ప్రసిద్ధులైన నటులెందరో ఈ సంఘం నుంచి వచ్చారు. ఇప్పటికీ ప్రతి ఏడూ నాటక సభలను నిర్వహిస్తోంటుంది.

నృత్యరంగంలో ఏలూరులో శ్రీ కోరాడ నరసింహారావు ఆధ్వర్యంలో నడుస్తున్న 'నృత్యభారతి', కూచిపూడిలో శ్రీ వేదాంతం సత్యనారాయణ కులపతిగా నడుస్తున్న 'సిద్ధేంద్ర కళాక్షేత్రం' తెలుగు దేశానికే గర్వకారణమైన సంస్థలు. సంగీత రంగంలో ఏలూరు శ్రీ కె. వి. సుబ్బారావు ఆధ్వర్యంలో నడుస్తున్న 'ఫెడరేషన్ ఆఫ్ మ్యూజిక్ సభాస్', రాజమండ్రిలోని 'త్యాగరాజు నారాయణ సేవాసమితి' చెప్పుకో దగిన సంఘాలు చిత్రకళారంగంలో హైదరాబాదులో శ్రీ రాజుగారి ఆధ్వర్యంలో సాగే హైదరాబాద్ ఆర్ట్ సొసైటీకి ఒక ప్రత్యేకత వుంది. దీనికి ముఖ్య కారణం ఈ సంస్థ వెలువరించిన 'కళ' ప్రత్యేక సంచికలు. ఇవి చాలా గొప్ప ప్రచురణలు. అలాగే సిద్ధిపేటలోని ఆర్ట్ గ్యాలరీలు, లలిత కళా సమితి కూడ గణనీయమైంది. ఉత్సాహవంతులైన యువ చిత్రకారులు ప్రతిభ ఈ సంఘానికి మూలధనంగా వుంది. రాజమండ్రిలో ప్రసిద్ధ చిత్రకళాకారుడు దామెర్ల

రామారావుగారి స్మృత్యంకితంగా చిత్రశాలను నడుపుతున్న 'దామెర్ల రామారావు ఆర్ట్ గ్యాలరీ' ఒక విశిష్ట సంస్థ. ఇది చక్కటి గ్రంథాలయాన్ని కూడా నడుపుతోంది. నెల్లూరులో మరొక గ్యాలరీ వుంది.

జానపద కళలకు సంబంధించి వీధి నాటకాలకు, భాగవతాలకు, జక్కుల కథలకు, తోలుబొమ్మలాటలకు ఇంకా ప్రాచుర్యం పూర్తిగా నశించలేదు. కాని, వీటి కోసం అంకితమై జనచైతన్యం తేవడానికి కృషి చేసే సంఘటిత శక్తులూ తక్కువయ్యాయి. ఈ రంగంలో కర్ణాటక మన రాష్ట్రం కంటె ఎంతో ముందడుగులో వుంది. శ్రీకాకుళం జిల్లా తూర్పు భాగవత సంప్రదాయాన్ని రక్షించి పోషించడానికై ఒక సంఘం ఏర్పడాలని కొన్ని ప్రయత్నాలు జరిగేయి. కాని, ఫలించినట్లు లేదు. హరి కథలకు మాత్రం ఒకటి రెండు శిక్షణ కేంద్రాలు వెలిశాయి. తూర్పు గోదావరి జిల్లాలో కపిలేశ్వరపురం జమీందారు గారు ఆదరం కొద్దీ ఒక శిక్షణ కేంద్రాన్ని స్థాపించారు. తిరుపతి సంగీత నృత్య కళాశాలలో హరికథా విభాగం ఉన్నది. అలాగే మిగిలిన సాంప్రదాయిక కళలన్నిటికీ శిక్షణ కేంద్రాలు ఎంతో అవసరం.

సాంస్కృతిక రంగంలో, అత్యంత ఉత్సాహం నాటక ప్రయోగం మీదనే కనుకే నాటక క్షేత్రానికి నిబద్ధమై వెలసినన్ని సంఘాలు మిగిలిన కళా క్షేత్రాల్లో ఏర్పడలేదు. మిగిలిన వాటిలో కేవలం ఉత్సాహం చాలదు. శాస్త్రీయత, సునిశిత శిక్షణ ఎంతో అవసరం. సాధన జీవనాడి. వాటితో అంత పెద్ద ఎత్తులో నిమిత్తంలేనిది నాటక రంగమనే భావనతో అనేక మంది ఉత్సాహవంతులు నాటకాన్ని ప్రధానంగా పెట్టుకొని సాంస్కృతిక సంస్థలను ఏర్పాటు చేస్తున్నారు. అయితే క్రమం తప్పకుండా సంగీత నృత్యాలను కూడా ఆదరిస్తున్నారు. అందులోనూ నవీన పంథాలోని సంగీత నృత్యాలను అధికంగా ఆదరిస్తున్నారు. సాంస్కృతిక వారసత్వంగా వచ్చిన శాస్త్రీయ కళలు, సాంప్రదాయిక కళలు ప్రాచుర్యం సన్నగిల్లకుండా విజ్ఞులైన వారు ముందుకు వచ్చి చక్కటి సంఘాలు స్థాపించి వీటిపట్ల ప్రజల అభిరుచిని సంఘటిత పరచాలి. *





# మలయానిల గీతము

—దాశరథి

మలయానిలములు వీచెను
తెలుగు ధరణిపై ఉగాది దివ్యోత్సవ వే
ళలలో; ఆనందామృత
ములు కురిసె రసాంతరంగములలో కవితల్

మా తెలుగు జాతి ఈ యేడు ప్రీతితోడ
వెండి పండుగ జరిపెను విజయమొప్ప;
పాతికేడులేకమ్ముగా వరలినట్టి
ఇల్లు వేలేండ్లు నిల్లై వర్ధిల్లుగాక

ఈ యుగాది ప్రత్యేకత నేమి చెప్ప !
అఖిల విశ్వాన నున్నట్టి ఆంధ్రులెల్ల
ఐకమత్య గీతమ్ముల నాలపించి
తెల్గు తల్లికి కానుకల్ తెచ్చినారు

కరువు కాటకములు పోయి ధరణియెల్ల
అన్నపూర్ణయై ఈ యేడు అలరుగాక !
దుర్మతియె సన్మతిగ మన కార్మికులకు
కర్షకులకు శుభమ్ములీ గలుగుగాక !

# USAGE OF PERSONAL PRONOUNS IN TELUGU

GERALD KELLY

THESE are rather extensive extra-linguistic, specifically, social or context of situation, limitations on the usage of personal pronouns, particularly 2nd and 3rd persons. A brief summary is given here:

**1st person:**

**1st person singular :**

*ne:nu* 'I' offers little difficulty. Some use, particularly by older generation speakers in Telangana, of *me:mu* "We" for other dialects, *me:mu* is regarded as pompous or arrogant by coastal dialect speakers. The usage is, in fact, usually influenced by the use of ham "We" by local Urdu speakers. For *me:mu* users, Urdu is ordinarily regarded as a language of elegance and politeness; other dialect speakers are either unaware of the influence or despite it, with the same results.

**1st person plural :**

The major feature here is between *me : mu* 'exclusive' and *manam* 'inclusive' The distinction is obligatory.

**2nd person Singular :**

Two forms, *nuwwu* and *ni : wu* have currency as second singulars. The latter is bookish or archaic for most speakers, but can be heard from conservative speakers, particularly among the older generation and the traditionally educated. Generally, the social conditions of usage for second singular are these.

1) Outside the family, among close friends, most frequently but not exclusively of the same sex.
2) In addressing social inferiors, especially servants in abuse.
3) Within the nuclear family.
4) In addressing members of the extended family younger than the speaker.

5) In addressing older members of the family with whom there is frequent social contact. In conservative families this usage would not extend to addressing the father or, in some cases, the mother.

6) Usage varies for addressing in-laws with whom there is little social contact: *nuwwu* would be proper for an elder brother's wife resident with the family, except among conservative groups. *mi : ru* (see below) is otherwise more common.

**2nd person plural/respectful :**

*mi:ru.* This form is used generally in addressing groups of any social character. It is also appropriate in addressing individuals under the following conditions:

1) Strangers of respectable aspect or acquaintances with whom social relations are strictly formal.

2) Social, economic or occupational superiors.

**2nd person respectful**

*tamaru.* This term may be singular or plural. Its use indicates the recognition of extreme social distance between the speaker and the person address. In earlier times, it was appropriate for the addressing ficials. Today, its usage is limited to peasants addressing tax collectors, beggars seeking help, and appropriate circumstances, students addressing professors. In general, it is regarded as inappropriate for any occasion by the middle classes.

**3rd person singular, masculine**
**wa : Du / wa : NDu**

This term, unlike those discussed below, is invariably singular. The later form is archaic, but is still in use among rural older generation speakers. Its usage is appropriate in the following situations:

1) In referring to a close friend.

2) In referring to a social inferior, whether by caste or occupation, unless the usage would offend the democratic sensibilities of the person addressed.

3) In referring to individuals for whom the use of *mi:ru* in address is hypocritical or simply in-sincere.

4) In referring to younger male members of the family, exclusive of in-laws.

**3rd person singular masculine :**
**aTanu/aTaDu**

This form is also always singular. aTaDu is archaic or bookish, but may be heard from the traditionally oriented or the conservatively inclined. It is appropriate in the following situations:

1) In referring to strangers of respectable aspect or acquaintances with whom social relations are strictly formal.

2) By democratic speakers, in stressing the lack of social distance between speaker and individuals for whom a conservative speaker might use *wa:Du* under condition 2 above.

**3rd person singular mascular :**
**ayana**

This form is used to refer to part of the group addressed as *mi:ru* under condition 2 above. It is appropriate in the following circumstances:

1) In referring to individuals whose social level is similar or superior to the speaker's, including older members of the family (whether addressed as *nuwwu* or *mi:ru*) except when the person addressed is a relative of the person referred to, but not of the speaker (see below).

### 3rd person plural/singular respectful: wa:ru

This form is the regular 3rd plural pronoun form for referring to humans. It has restricted usage as a singular referent as well. It is appropriate under the following conditions:

1. When addressing a person who is related to the referee but not to the speaker and both the addressee and the referee are recognized as respectable.
2. Rarely, to show respect for a particularly eminent woman, such as a minister or state governor.
3. Among lower class speakers, especially servants, regularly to refer to any member of the employing family.

### 3rd person singular feminine: a:me

This is the regular referent for females Whose social level is similar or superior to the speaker's. Increasingly, especially in urban areas, it is also employed to refer to females of lower social background to emphasize the breakdown of traditional social discriminations.

### 3rd person singular feminine/neuter: adi

This is the regular referent for non-human nouns. Applied to women, it is appropriate under the following conditions:

1) To call attention to the inferior status of a women in relation to the speaker.
2) In abuse.
3) Within the family, to refer to younger-females, exclusive of in-laws. In some conservative groups, also to refer to sisters older than the speaker.
4) In reference to females addressed as *mi:ru*, where the respectful address is insincerely meant.

### 3rd plural respectful: wa:ru

Used as a plural form for humans. *wa:ru* always implies some respect.

### 3rd plural human: wa:LLu

This form is socially colourless or ambiguous. It may variously be employed for groups whose members are referred to by *wa:Du, ayana, wa:ru, a:me*, or (if in reference to a female) *adi.*

### 3rd person plural non-human: awi:

This is the regular pronoun referent for non-human nouns.

( from 'A Grammar of Telugu' - manuscript )

## చంద్రశాల

పదవోయి తెలుగువాడా
అదే నీ తెలుగు మేడా
సంకెళ్ళు లేని నేల
సంతోష చంద్రశాల

— శ్రీ శ్రీ

# FORMATION OF ANDHRA PRADESH AND TASKS BEFORE TELUGU PEOPLE

P. SUNDARAYYA

IT is the martyrdom of Sri Potti Sreeramulu in December 1952, preceded by the glorious and historic Telangana People's Struggle and their great sacrifices against Nizam, for dissolution of Hyderabad State and for the formation of Vishal Andhra that finally set ablaze the growing upsurge of Telugu people, that led to the formation of Andhra State of Telugu speaking areas of erstwhile Madras State on 1st October 1953.

But this was only the first step. The formation of Andhra Pradesh on 1st November 1956, abolishing the old Hyderabad State, fulfilled, in the main, the long cherished urge of Telugu speaking people to have their own linguistic state in our country-India.

The formation of Andhra Pradesh was the culmination of new renaissance of Telugu people that was ushered in the later part of 19th century as part of our people's struggle for independence against British Imperialist occupation.

We, the Telugu people take pride that we are the initiators of the movement for linguistic states in our country as early as 1907. The Indian National Congress under the leadership of Mahatma Gandhi had to recast the organisation on the basis of languages (though they did not then include territories ruled by Indian princes and Nawabs) in order to draw in masses to develop our struggle for National Freedom against British Imperialism.

It is now an accepted principle by progressive sections throughout the world, that the administration should be in the mother tongue of the people ; the education at all levels including the university level should be through the mother tongue ; and the economic development and economic integration is easier, if the people speaking the same language and living in contiguous territories are in one state, instead of being scattered in different multi lingual states or units.

Historical experience has shown that a people having a common languge and living in contiguous territory, developing close common cultural and social affinity, evolve into a separate nationality, when their economic development reaches such a stage that binds them together.

As such, all progressive sections are strongly for equal and balanced economic development of all parts of a state and of all states and regions of our country. They are strongly advocating more powers to the states, and full autonomy, under overall guidance of the central government which shall exclusively keep to itself defence, foreign affairs, and necessary communications, currency and economic planning, with authority to give decision on all matters, connected with more than one state.

Yet, after achieving independence, the formation of linguistic states was not acceded to, immediately. It was only after a prolonged agitation and struggle, beginning with the fasting and martyrdom of Sri Potti Sreeramulu in 1952, the Samyukta Maharastra and Maha Gujarat mass agitation and struggles of 1956–61, and the formation of Punjab and Haryana states in 1966, that the Reorganisation of Linguistic States was achieved in the main. There are still certain border adjustments unresolved and demands for separate states or for autonomous areas in the existing states, where the tribal people or people of small nationalities are living and asserting their own separate identity. The question of devolution of more powers to the states and fullest autonomy to states, while strengthening the sovereignity and integrity and unity of India is engaging the attention of our people.

## THE TELUGU PEOPLE IN HISTORICAL PERSPECTIVE

We need not trace here the evolution of Telugu people from Vedic period upto now, their earliest social and economic organisation when they were living in tribal societies or when they formed their kingdoms before Satavahanas and in later periods. We the Telugu people are proud of the achievements of our ancestors over 3000 years under various stages of our historical development, Nagarjuna Konda, Amaravati Stupas, along with Ajanta paintings and Ellora temples ; Kondapuram, Alampur excavations, the monumental temples and palaces of Kakatiya period, the Vijayanagar empire and Krishnadevaraya period of Telugu culture and literature ; and the contribution during Muslim rule of Qutub Shah dynasty. Can there be any educated Telugu man or woman, who is not proud of Nannayya, Tikkana, Potana and of the Astana Kavis of 13–16th centuries ? The glorious Janapada literature of our people, Yakshaganam, Samkirtanams, songs of women and the powerful poetry of our social reformers like Vemana ridiculing the outdated and cruel traditions and hypocritical pretensions of upper classes, it is on these rich cultural milieu, generations of Telugu people were brought up.

It was only during the Satavahana period and later during the Kakatiya period, that more or less the present day Telugu speaking areas were under one rule ; perhaps for a short period under Aurangajeb and Nizam dynasty too, we were under one rule. But with the advent of British imperialism in the middle of 18th century, the Telugu people were again under different regimes, coastal districts under direct British rule, and after a period the Rayalaseema districts also were ceded to them, the rest in Telangana area of Nizam's Hyderabad and certain areas under Mysore Maharaj.

Though we have a long cultural history and broadly a common language, we, just like so many other people in our country, were in the process of forging close economic links, an integrated economy under one administrative rule, whether a

king or a democratic republic. We did not achieve it. We were under various feudatory princes, who belonged to dominant communities in different places : except when a powerful dynasty dominated and made these princelings their vassals.

It was only with the advent of British rule, who violently destroyed the then existing economic relations in our country, without replacing the old by new developed economic relations as in the Western countries, that the intelligentsia and our economically dominant sections started, to mobilise our people to fight the British rule and develop our own economy and our own culture, in opposition to that of foreign rulers.

The pioneers of this renaissance in Andhra were Sri Kandukuri Veeresalingam, Chilakamarti Lakshminarasimham, Gidugu Ramamurthy Pantulu and Gurajada Apparao, the historians Komarraju Lakshmanarao and Chilukuri Veerabhadrarao and others.

But, it was the political leaders, who were the pioneers of the Telugu speaking State. It was in 1907 in the conference at Bapatla, that the demand was raised for a separate Andhra province to be carved out of the Madras Province. The leaders of this movement were all known political and Congress leaders of that time, Desabhakta Konda Venkatappayya, Gadicherla Harisarvothama Rao, Darsi Chenchayya, Tanguturi Prakasam Pantulu, Bhogaraju Pattabhi Sitaramayya and Kasinathuni Nageswara Rao.

In Telangana area there were the leaders of Grandhalaya movement which began with the establishment of Krishna Devaraya Andhra Bhasha Nilayam in 1901 and of Andhra Maha Sabha : Sri Madapati Hanumantha Rao, Suravaram Pratapa Reddy, Sri Burugula Rama Krishna Rao, Sri Mandumala Narsing Rao, Sri Konda Venkata Ranga Reddy and the radical section headed by Sri Ravi Narayana Reddy and Baddam Yella Reddy and a band of their young co-workers who have all become communists. The popular Urdu poet comrade Maqdum Mohiuddin, one of the top communists and Andhra Maha Sabha leaders, fought against Nizam's rule drawing in the progressive Muslims in the joint people's struggle.

It was this radical wing that gave Andhra Maha Sabha a new orientation, and became the leaders of Telangana People's struggle against Nizam and staunch fighters for abolition of Hyderabad State and formation of Vishalandhra.

## VISHALANDHRA LO PRAJARAJYAM

In Andhra area, the communist movement took an organised form in 1934 September. The communist organisation spread to Rayalaseema and Telangana districts by 1940. From the very beginning the communist party stood for the formation of Vishalandhra and people's Raj in it as part of People's Democratic Republic of India as their immediate objective. For them the artificial division of Telugu people into Circars, Rayalaseema and Telangana was meaningless and they ignored these divisions and based their organisation on one state centre and all its district committees directly under it.

The communist movement has been in the forefront in mobilising Telugu speaking people in Madras Province to have their own separate province excluding Madras city and Ballari district except 3 talukas of it. It is they who with their united stand contributed significantly to overcome the opposition of certain local sections in Rayalaseema area to the formation of the Andhra State. Similarly it is the communist movement in Telangana area that was a powerful force to fight against the forces who wanted to preserve the old Hyderabad State, neglecting the very conception of linguistic states and also forces who wanted a separate Telangana State instead of an united Telugu State, the Andhra Pradesh.

Publication of the booklet "Vishalandhra Lo Prajarajyam" and its wide circulation in 1946, depicting a bright vision of how Telugu people's future could be moulded, had widely popularised the conception of Vishalandhra.

More than anything else, the Telangana People's movement and peasant armed struggle against *Vetti* (forced labour without payment) against evictions and for land to the tiller, abolishing landlordism – (It took away the land of the big land owners, leaving a reasonable holding of 10 acres wet or upto 100 acres dry for cultivating family and thus 10 lakh acres were distributed) ; and for abolishing Nizam's dominion and dissolution of Hyderabad State, merging the three linguistic parts, neighbouring with the linguistic areas to form Vishalandhra etc., it is this Telangana people's struggle that had brought into the forefront both the formation of linguistic states as well as the question of drastic agrarian reforms, and land ceiling legislation for distribution of land to the tiller.

But for this heroic struggle of the Telangana people, the formation of linguistic states would not have been achieved so early or to that extent. It was the communists who stood against the forces of disruption, both against separate Telangana as well separate Andhra agitation of 1969 to 1972, and defended the integrity of Andhra Pradesh.

At the same time, the communists acknowledge the fact that only because a majority of congress leaders stood firmly for the formation of Andhra State and later Andhra Pradesh, these could be brought into existence. Similarly, the disruptive movements for separate Telangana and for separate Andhra could be successfully fought and Andhra Pradesh could be preserved only because a good section of congress men stood firm. In the formation of Andhra Pradesh, the role of the communists and especially the Telangana people's struggle has a significant contribution.

## THE TASKS UNFULFILLED AND DANGERS AHEAD

It is now 25 years since the formation of Andhra Pradesh. It survived the two movements, the separate Telangana and separate Andhra movement. But, with the division of the State into 6 zones for the purposes of jobs and for educational seats ; and with still persisting regional inequalities between Telangana, Rayalaseema and Coastal regions, with regard to economic development, irrigation and power distribution, in the growth of industries, the per capita income levels—regional feelings are being roused, as if these problems can be solved by breaking up Andhra Pradesh.

The basis for the growing discontent of the people which can be easily diverted into rousing of regional feelings, is the growing unemployment, especially the unemployment of the educated. Over 50% of our people are living below poverty line. Only 25% of children complete their VII standard. The government's well intentioned schemes of providing scholarships and reservations to ensure scheduled castes, tribes and backward communities cover a very small percentage of these sections and is no nearer to solve their backwardness or to develop them to catch up with the advanced sections. Today there is more growth of caste feelings, prejudices and tensions.

The literary and cultural heritage and unity that we have inherited over centuries has not yet become the common heritage of more and more of our people, especially the economically and socially backward sections of our people who had been deprived of this heritage in the past.

The solution for these problems, is not disruption of Andhra Pradesh. It is a great advance and one of the basic achievements of Telugu

speaking people and is a historical mile-stone in the progressive development of our people. All progressive and enlightened sections of our people should pull together to solve the problems facing us.

We must think and act, as belonging to one people of the whole state and not as belonging to Telangana, Rayalaseema or Coastal areas or of one district or taluka. Every problem, every issue that affect our vast people, should be solved as to which section of the people and which problem should be taken on priority basis and which problem could be a little while postponed and taken up a little later ; taking the whole state of Andhra Pradesh and not from the angle of one region or of one district or of one area.

1. First and foremost priority is for guaranteeing employment to all able bodied men and women ; the right to work and ensuring them minimum livelihood ; meanwhile providing unemployment relief.

(a) Full employment can be ensured by carrying out radical land reforms, distributing all the land of the land owners who own more than 10-15 acres of double crop wet, or 20-25 acres of single crop wet, if they are not personally cultivating them or if they have other sources of income. Land must belong to the actual tillers, enabling them to earn a living. We can ensure each landless family or land poor family, 2½ acres providing these holdings with the irrigation facilities, through canals, wells or by power lift, and guaranteeing of minimum wages for agricultural labourers.

(b) The artisans should all be provided with the necessary raw materials, and the government must take over the product and sell it, paying minimum wages for the artisan family, which shall be more than a subsistance wage, (it now works out to be Rs. 400/-) ensuring a need based minimum wage.

(c) Take up more and more public works, like irrigation projects, road and railway communications, to guarantee employment to the unemployed and under-employed rural poor.

(d) Absorb educated unemployed by having more primary, secondary, vocational schools (ITIs or Polytechniques) ; and colleges as well as more medical and public health centres.

(e) Take over all big industries from private sector and they be run by the government itself erecting new factories and projects equitably in different parts of our State keeping in mind the material availability and the need to absorb unemployed in these areas.

Immediate implementation of schemes for unemployment relief till the jobs are ensured at the rate of one *Kg*. of food grains and a rupee for other expenses per day per worker.

2. A hut or dwelling place for every poor family in rural urban areas especially for scheduled castes and tribes.

3. (a) Assured supply of drinking water to both rural and urban areas.

(b) Water distribution and management for irrigation, for industrial and power generating purposes.

In our Telugu speaking state, vast areas are drought prone, due to the meagre rains, especially in Rayalaseema areas and Mahbubnagar, Nalgonda

లేనందున తెలుగు పిల్లలు మరాఠి పాఠశాలకు పోవుచుండిరి. తెలుగు భాషపై అభిమానమున్న కీ॥ శే॥ గుమ్మడి ఆనంద రావుగారు 1934 సం॥లో "శ్రీ సదానంద తెలుగు పాఠశాల" అను పేరుతో నొక పాఠశాలను స్థాపించారు. తరువాత ఇది "మునిసిపల్ తెలుగు ప్రాథమిక పాఠశాల"గా మార్చ బడినది. ఇట్లు తెలుగు వారు నివసించే ప్రాంతాలలో ఒకటి రెండు మునిసిపల్ తెలుగు ప్రాథమిక పాఠశాలలు నెలకొల్ప బడినవి. కాని తెలుగుభాషలో పాఠ్య పుస్తకాలు లేనందున తెలుగు బడులు అంతగా వృద్ధి పొందలేదు. విద్యార్థుల విద్యా స్థాయికూడ పెరుగకుండెను. అందువల్ల తెలుగుభాషను పునాదుల నుండి బాగుచేసి విద్యార్థుల విద్యాస్థాయిని పెంపొం దింప జేయుటకై ఆంధ్ర సారస్వత పరిషత్తు బొంబాయి "తెలుగు పాఠ్య పుస్తకాల ప్రచురణ కార్యము"ను చేపట్టినది. పరిషత్తు మహారాష్ట్ర ప్రభుత్వానుమతి పొంది, ప్రభుత్వం ప్రచురించుచున్న పాఠ్యపుస్తకాలను 1 నుండి 6 వ తరగతి వరకు చరిత్రా, భూగోళం, సైన్స్, గణిత విషయాలకు సంబంధించిన దాదాపు 20 పాఠ్య పుస్తకాలను తెనిగించి వివిధ రంగులలో అందగా, ఆకర్షణీయంగా ప్రచురించి వేలకొలది వెనుకబడిన తెలుగు బీద విద్యార్థులకు "చేత పుస్తకం పట్టు కొని చదివే సద్భాగ్యం" కలిగించింది. ఈ విధంగా పరిషత్తు కృషి ప్రయత్నముల వలన ఆనాడు ఒకటి - రెండు ఉన్న తెలుగు ప్రాథమిక పాఠశాలలు ఈనాడు మూడు పూవులు ఆరు కాయలై 46 తెలుగు ప్రాథమిక పాఠశాలలుగా వృద్ధి పొందినవి. విద్యార్థుల విద్యాస్థాయి కూడ పెరిగినది. ఈ పాఠశాలలన్నియును బొంబాయి మునిసిపల్ కార్పొరేషన్ ద్వారా నడుపబడు చున్నవి. ఈ పాఠశాలల్లో దాదాపు 300 మంది ఉపాధ్యాయులు పని చేయుచున్నారు. కార్పొరేషన్ ద్వారా ఒక సెకండరీ స్కూలు కూడ నడుపబడుచున్నది. ఇందు S. S. C. వరకు బోధనా జరుగుచున్నది. ఇదిగాక "ఆంధ్ర ఎడ్యుకేషన్ సొసయిటీ హైస్కూలు" అను మరొక సెకండరీ స్కూలు కూడ నడుపబడుచున్నది. ఇందులో 12వతరగతి వరకు బోధనా జరుగుచున్నది. ఇవిగాక థానా, పూనా, చంద్రపూర్, నాందేడ్ మొ॥లగు జిల్లాలలో కూడ తెలుగు ప్రాథమిక పాఠశాలలు మరియు కొన్ని తెలుగు సెకండరీ స్కూళ్ళు కూడ ఉన్నవి. ఈ పాఠశాలలో చదివే విద్యార్థులందరును ఆంధ్ర సారస్వత పరిషత్తు బొంబాయి సంస్థ ప్రచురించే తెలుగు పాఠ్య పుస్తకాలను పరిషత్తు సరఫరా చేయు చున్నది, ఈ విధంగా పరిషత్తు తెలుగు భాషా ప్రచారం ప్రసారం చేయడంవల్ల నేడు తెలుగుభాష ఉన్నత స్థితినందుకొన్న దని చెప్పుటలో ఎట్టి సందేహము లేదు.

బొంబాయిలో అనేక తెలుగు సంఘాలు, సంస్థలు గలవు. ఇవి కుల, మత, జాతి భాషలకు చెందినవి. ఇవన్నియును వివిధ రంగాలలో, వివిధ కార్యకలాపాలు జరుపుచూ, తమ అభివృద్ధి మార్గంలో ముందంజ వేయుచున్నవి. ఆంధ్ర సార స్వత పరిషత్తు, బొంబాయి తెలుగు పరీక్షలు నడుపుచూ తెలుగు పాఠ్య పుస్తకాలను ప్రచురించి మహారాష్ట్ర మండలి తెలుగు బడులలో చదివే విద్యార్థులకు సరఫరా చేయుచున్నది. ఆంధ్ర ఎడ్యుకేషన్ సొసయిటి హైస్కూలు S. S. C. మరియు 12 వ తరగతి వరకు విద్యాబోధన చేయుచున్నది. 'ఆంధ్ర మహాసభ' తెలుగు సాంస్కృతిక కార్యక్రమాల నేర్పాటు చేయుచూ, తెలుగు నాటక కళనభివృద్ధి చేయు చున్నది. 'వివేక గ్రంథాలయం' అను సంస్థ తెలుగు ప్రజలలో విజ్ఞానమునభివృద్ధి చేయుటకై కృషి చేయుచున్నది. ఈ మధ్య అవతరించిన 'బొంబాయి తెలుగు ఫెడ్రేషన్' మరియు 'బొంబాయి తెలుగు మహా సంఘం' తెలుగు వారి అభివృద్ధికి ప్రయత్నిస్తున్నవి. 'ఆర్య సమాజం' తెలుగు ప్రజల ధార్మికో న్నతికి. 'ఆంధ్ర ఆయుర్వేద వైద్య సంఘం' తెలుగువారి ఆరోగ్యాభివృద్ధికి పాటు పడుచున్నవి. ఇవి తెలుగు జాతి సార్వజనిక సంస్థలు. 'అఖిల పద్మశాలి సమాజ్, బొంబాయి' పద్మశాలి తెలుగు సుధారక మండలి, 'పద్మశాలి యువక్ సంఘం,' 'ఓం పద్మశాలి సేవ సంఘం,' 'పద్మశాలి మిత్ర మండలి' మొదలగునవి పద్మశాలీయుల ఉన్నతికి, 'ఆంధ్ర హరిజన సేవ సంఘం' హరిజనుల అభివృద్ధికి, 'తెలుగు ముదిరాజ్ సమాజ్ (తెలుగు అను జాతి సంఘం) మొదలగు నవి తమ - తమ కులజుల ఉన్నతికి పాటు పడుచున్నవి. ఇవి కేవలం బొంబాయి మహానగరంలోని ముఖ్యమైన సంఘాలు. ఇవి గాక ఇంకను చిన్న - చిన్న సంఘాలు ఎన్నియో వాడ వాడల ఉన్నవి. ఉదా॥ రామారెడ్డి పద్మశాలి సంఘం, ఆంధ్ర జ్యోతి నాట్య కళామండలి మొ॥ వి. ఇంకను థానా, పూనా, సోలాపూర్, చంద్రాపూర్, నాగ్‌పూర్, నాందేడ్, ఔరంగా బాద్. అహమ్మద్‌నగర్ మొదలగు జిల్లాలలోను, తాలుకా లలోను, అనేక సంఘాలు తెలుగు వారి ఉన్నతికి పాటు పడు చున్నవి. ఉదా॥ పద్మశాలి సమాజ్, కామ్‌ఠి, నాగ్‌పూర్ జిల్లా సిందేవాహి పద్మశాలి సమాజ్ (చంద్రపూర్ జిల్లా,) పద్మశాలి సమాజ్ చౌఫాల్ (నాందేడ్ జిల్లా) మొ॥ వి.

## తెలుగు సంస్కృతి - సభ్యత :

తెలుగువారు ఆంధ్రదేశం నుండి మహారాష్ట్ర ప్రాంతానికి వలసవచ్చి అనేక సంవత్సరాలైనప్పటికిని తమ భాష, సంస్కృతి-సభ్యత చెడకుండ తెలుగు దనాన్ని తేజరింప జేస్తున్నారు. వీరి వేష-భాషలు ప్రత్యేకింపబడినవి. వీరి నడవడికలు, ఆచార-విచారములు అన్నియును తెలుగు సంప్ర దాయము ననుసరించియే ఉండును. వీరు తమ పండుగ-పబ్బాలను తెలుగు సంప్రదాయము ననుసరించియే జరుపు కొందురు. అయినప్పటికిని మహారాష్ట్ర సంప్రదాయము ననుసరించి కొన్ని పండగలను మహారాష్ట్రులతో ఏకమై వారి పద్ధతుల ప్రకారంగా జరుపుకొందురు. ఇట్టి పండగలలో వినాయకచవితి, దసరా, దీపావళి, గోకుల అష్టమి ముఖ్యమైనవి. వినాయకచవితి పండగకు వినాయకుని విగ్రహమును పది రోజులు తమ ఇంటిలో ఉంచి, పూజించెదరు. వీథి-వీథికి సార్వజనిక గణేషోత్సవాలు జరుపబడును. ఈ ఉత్సవాలలో సాంస్కృతిక కార్యక్రమాలు, సినిమా కార్యక్రమాలు విరివిగా జరుపబడును. ఒక్కొక్క వినాయకుని విగ్రహం 25 అడుగుల ఎత్తువరకుండి, చూచుట కెంతో ముచ్చటగా నుండును. 11వ రోజున వినాయకుని విగ్రహమును మేళతాళములతో ఊరేగుతూ 'చౌపాటి' అను సముద్రములో విసర్జింతురు. దసరా పండగ కూడ వినాయక చవితి వలెనే 'నవరాత్రులు' అనే పేరుతో ఘనంగా జరుపబడుచున్నది. ఇది ఆంధ్ర, కర్నాటక, గుజరాతి సంప్రదాయములను సూచించుచున్నది. ఈ పండుగ నాడు ఆంధ్ర సంప్రదాయము ననుసరించి క్రొత్త బట్టలు ధరించి, మాంసాహార పదార్థములు, పిండివంటలు చేసికొని, రాత్రిపూట 'జంబి' అను ఆకును బంగారం అంటూ ఒకరికొకరు ఇచ్చుకొంటు ఒకరి నొకరు కౌగిలించుకొందురు. కర్నాటక సంప్రదాయము ననుసరించి ఆదిశక్తి అవతారమైన దేవి విగ్రహమును ప్రతిష్ఠించి. నవరాత్రులు పూజలు సలిపి, వివిధ రకములైన కార్యక్రమములను జరుపుచుందురు. ఈ దేవి విగ్రహము కూడ 20 అడుగుల ఎత్తువరకు ఉండును. పదవ రోజున మేళతాళములతో దేవి విగ్రహమును తీసుకొనిపోయి చౌపాటి సముద్రమున విసర్జింతురు. ఈ పది రోజులు గుజరాతి సంప్రదాయము ననుసరించి రాత్రిపూట 'గర్బా' అనే నృత్యము అనగా కోలలు కొట్టుచూ ఆటలు ఆడుదురు. ఈ నృత్యమును గుజరాతి భాషలో 'గర్బ' అందురు. దీనిని గుజరాతి వారు అతివైభవముగా జరుపుకొందురు. దీపావళి పండుగ మహా రాష్ట్రులకు అతి ప్రాముఖ్యమైనది. ఆంధ్ర ప్రాంతంలో 'సంక్రాంతి' పండగను ఐదు రోజులు జరిపినట్లు ఇచ్చట దీపావళి పండగను ఐదు రోజులు జరుపుదురు. ఈ పండగకు రకరకములైన పిండి వంటలు అధికంగా చేసికొందురు. పిల్లలు ఐదు రోజులు బొమ్మల కొలువులు పెట్టు కొందురు. ఐదు రోజులు దీపాలు తోరణాల వలె వెలిగింతురు. దీపాలతో ఈ పండగ కలకలలాడి పోవును. పిల్లలు రాత్రిపూట విపరీత మైన టపాకాయలు కాల్చెదరు. ఐదవ రోజు 'భావుబీజ్' అను పేరుతో అక్కలు తమ తమ్ముళ్ళకు శుభమును చేకూర్చ హారతులిత్తురు. ఇట్టి పండగ ఐదు రోజులు అతి వైభవముగా జరుపబడును. ఈ పండగను తెలుగు వారు కూడ ఐదురోజులు ఘనంగా జరుపుదురు. 'గోకులాష్టమి' కూడ అతి ప్రాముఖ్య మైనది. ఈ పండగ శ్రీకృష్ణుని జన్మదినమును పురస్క రించుకొని జరుపబడును. శ్రీ కృష్ణుని జన్మోత్సవము అష్టమి నాడు జరుపుదురు. కనుక దీనిని గోకులాష్టమి అందురు. కృష్ణుడు అష్టమి నాడు రాత్రి 1 గం॥ కు జన్మించును. తెల్ల వారి నవమినాడు కృష్ణుడు గోపకులతో ఆటలు ఆడినట్లు, గోవింద ఆలారే ఆలా॥ అంటూ పాటలు పాడుచు వీధులలో తిరుగుచూ ఆటలు ఆడుదురు. ఈ దినమున వీధులలో రెండు మూడు అంతస్తుల ఎత్తున 'మటికి'అను బుడ్లను కరెన్సీ నోట్లతో అలంకరించి వ్రేలాడ గట్టుదురు. గోవింద ఆటలు ఆడు వారు వచ్చి కృష్ణుడు గోపికల పెరుగు బుడ్లను పగుల గొట్టి నట్లు పగుల గొట్టుదురు. ఇది చూచు వారికి భయాందోళనతో కూడిన ఆనందోత్సాహము కలుగును. ఈ పండగను మహారాష్ట్రుల వలె మనవారు విశేషంగా జరుపుదురు. కొన్ని పండగలను సంస్థలు కూడ సార్వజనికంగా జరుపు చుండును. వినాయక చవితికి, గణేషోత్సవము, దసరాకు, స్నేహ సమ్మేళనము నార్లపౌర్ణమికి' యజ్ఞోపవీత ధారణోత్సవము, సంక్రాంతికి మహిళల 'పసుపు-కుంకుమ కార్యక్రమము' హోలికి 'రంగ పంచమి' ఉగాదికి 'పచ్చడి కార్యక్రమము' అను పేర్లతో సార్వజనికోత్సవాలు జరుపబడును. ఈ ఉత్సవాలను తెలుగు వారు కూడా విరివిగా జరుపుదురు. ఈ ఉత్సవాలన్నియును సాంస్కృతిక కార్యక్రమాలతో కూడి యుండును.

## కళలు :

మహా రాష్ట్రము కళలకు కాణాచి. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన అజంతా - ఎల్లోరా శిల్పాలు మహా రాష్ట్రమునకు గౌరవ చిహ్నాలు. శిల్ప కళకే గాక సంగీత, నృత్య, నాటక, చిత్ర, సినీ కళలకు కూడ మహా రాష్ట్రము ప్రసిద్ధి జెందినది.

ఇచ్చట మరాఠీ, హిందీ చలన చిత్రములెన్నో తయారగు చున్నవి. సినిమాల వలె బొంబాయిలో నాటక ప్రదర్శనశాలలెన్నో ఉన్నవి. సంగీత గాయకులు, నృత్య కళాకారు లెందరో నివసించుచున్నారు. చిత్రకళ ప్రదర్శనలెన్నో జరుగు చుండును. ఈ కళలను మహారాష్ట్రులతో పాటు తెలుగు వారు కూడ ఎందరో పోషిస్తూ, నటిస్తూ ఉన్నారు. హిందీ సంగీత దర్శకులలో జంట సంగీత దర్శకులుగా పేరు గాంచిన శంకర్ జయకిషన్‌లలో శ్రీ శంకర్ గారు తెలుగు వారు. హిందీ సినిమా రంగంలో ప్రసిద్ధి గాంచిన శ్రీ జయరాజ్ గారు మన తెలుగు వారు. వీరిద్దరును తెలంగాణ ప్రాంతమునకు చెందిన వారు. రాష్ట్రపతిచే 'పద్మశ్రీ' బిరుదు పొందిన హిందీ సంగీత దర్శకులు శ్రీ విజయ రాఘవరావు గారు. శ్రీ నాళం నాగేశ్వర్ రావు గారు మన తెలుగు వారు. హిందీ సినిమా లోకంలో సుప్రసిద్ధ నటిగా పేరు పొందిన శ్రీమతి రేఖ గారు తెలుగు వారు. వీరు ముగ్వురు ఆంధ్ర ప్రాంతమునకు చెందిన వారు. శ్రీ టి. నగేశ్ (వాయిస్ ఆఫ్ ముఖేష్) గారు రేడియో సంగీత గాయకులు. వీరును మన తెలుగు వారే. ఇట్లు తెలుగు వారు మహా రాష్ట్రమున అనేక రంగాలలో అనేక విధాలుగా విహరిస్తూ మహారాష్ట్రభివృద్ధికి పాటు పడు చున్నారు.

## పరిష్కరించవలసిన ప్రత్యేక సమస్యలు :

1) బొంబాయి మహానగరమున 46 తెలుగు ప్రాథమిక పాఠశాలలు, రెండు సెకండరి స్కూళ్ళు ఉన్నవి. ప్రాథమిక పాఠశాలల్లో 1 నుండి 7 వ తరగతి వరకు, సెకండరీ స్కూళ్ళలో 8 తరగతి నుండి 10 వ తరగతి వరకు విద్య బోధించబడును. సాధారణంగా 7వ తరగతి నెగ్గిన విద్యార్థులు 8 వ తరగతి నభ్యసించుటకై సెకండరీ స్కూళ్ళలో ప్రవేశింతురు. ఇది మామూలుగా జరుగుచుండెడిది. కాని గత రెండు సంవత్సరాల నుండి 7 వ తరగతి విద్యార్థులు అధిక సంఖ్యలో ఉత్తీర్ణులగుట వలన స్థలభావములో ఉన్నరెండు సెకండరీ స్కూళ్ళలో 8 వ తరగతి విద్యార్థులకు ప్రవేశము లభించుట దుర్లభమగుచున్నది. అసలు ఈ రెండు హైస్కూళ్ళు సరిపోవడం లేదు. కనుక మరొక సెకండరీ స్కూలును కట్టించేందుకు అంతర్జాతీయ తెలుగు సంస్థ ప్రయత్నించవలెను. అం. తె. సం. స్వయంగా నిర్మించినచో చాలా బాగుంటుంది. అట్లుగాని యెడల తిరుపతి దేవస్థానము వారిచే నిర్మింప జేయునట్లు గాని లేదా మహారాష్ట్ర ప్రభుత్వం హైస్కూలు కోసమై స్థలం ఇచ్చు నట్లుగాని ప్రయత్నించవలెను. స్థలం లభించినచో కొన్ని సంస్థలు హైస్కూలు నిర్మాణమునకు పూనుకొనుటకు సిద్ధముగా నున్నది.

2) మహారాష్ట్ర ప్రాంతంలోని తెలుగు ప్రాథమిక పాఠశాలల్లో చదివే విద్యార్థుల కోసమై ఆంధ్ర సారస్వత పరిషత్తు, బొంబాయి సంస్థ ద్వారా ప్రచురించుచున్న తెలుగు పాఠ్య పుస్తకాలకు అవసరమైన కాగితము కోటాను ఆంధ్ర ప్రభుత్వం ద్వారా మరియు అవసరమైన బ్లాకులు మహారాష్ట్ర ప్రభుత్వం ద్వారా సకాలంలో సరఫరా చేయునట్లు అంతర్జాతీయ తెలుగు సంస్థ ప్రయత్నింపవలెను.

3) మహారాష్ట్ర ప్రాంతంలో స్థిరపడి పోయిన ఆంధ్రులలో ఆంధ్ర సంస్కృతి సభ్యత నిలిచి (స్థాయిగా) ఉండునట్లు ఆంధ్ర కళాకారులను, సాంస్కృతిక బృందాలను అంతర్జాతీయ తెలుగు సంస్థ తనసొంత ఖర్చులతో మహారాష్ట్రమునకు పంపి తెలుగు ప్రజలలో ఆంధ్ర కళలు ఆదర్శంగా ఉండునట్లు చూడవలెను.

4) మహారాష్ట్ర ప్రాంతంలో నివసించే తెలుగు వారిలో అభిరుచి కలుగునట్లు చేయుటకై అప్పుడప్పుడు తెలుగు కవులను అంతర్జాతీయ తెలుగు సంస్థ సొంత ఖర్చులతో పంపి, తెలుగు భాష, సంస్కృతి, సాహిత్యముల గూర్చి ఉపన్యాసములు ఏర్పాటు చేయవలెను.

5) మహారాష్ట్ర తెలుగు ప్రజలలో భాష, సంస్కృతి, సభ్యత నిలిచి ఉండుటకు గాను, తెలుగు ప్రజలకు మనోరంజనము కలుగు నట్లు గాను అంతర్జాతీయ తెలుగు సంస్థ అప్పుడప్పుడు కొన్ని తెలుగు సినిమాలను ఇక్కడికి పంపి ప్రదర్శింపవలెను.

6) బొంబాయి మహానగరంలో అనేక తెలుగు సంఘాలు సంస్థలు ఉన్నవి. రోజుకో సంస్థ ఆవిర్భవిస్తుందన్న అతిశయోక్తి కానేరదు. ఇవి ఎవరికి వారే యమునా తీరే అన్నట్లు ఒక సంస్థకు ఇంకో సంస్థకు సంబంధాలు లేక దేనికదే వ్యవహరించు చున్నవి. కనుక వీటి నన్నిటిని ఏకం చేసి, తెలుగు వారిలో ఐక్యతను నిర్మాణం చేయుటకు అం. తె. సం. ప్రయత్నించవలెను. ✱

# జబల్పూరులో తెలుగువారు

గుమ్మా ప్రసాదరావు

అలహాబాదు మీదుగా బొంబాయినుంచి కలకత్తాకు పోయే రైలు మార్గంలో జబల్పూరు ఉంది. నేడు మద్రాసు నుంచి వారణాసి నడిచే గంగా కావేరి రైలుమార్గం కూడా జబల్పూరు మీదుగానే వెళుతుంది. జబల్పూరు నగరాన్ని సంస్కారధాని అంటారు. ఈ పేరు శ్రీ వినోబాభావేగారు పెట్టినది. మధ్యప్రదేశ్‌కు మట్టమధ్యనున్న నగరం జబల్పూరు. రాజధాని కావలసిన అన్ని అర్హతలున్నా రాజకీయ కారణాల వలన ఒక్క హైకోర్టుతోనే సంతృప్తి చెందవలసి వచ్చింది ఈ నగరానికి. చారిత్రక ప్రసిద్ధిగాంచిన త్రిపుర కాంగ్రెసు మహాసభ ఈ నగరంలోనే జరిగింది.

జబల్పూరు నగరంలో చాలామంది తెలుగువారు నివసించుచున్నారు. ఇక్కడకు మొట్టమొదటగా తెలుగువారు ఎప్పుడు వచ్చినది, ఎవరు వచ్చినది నిదర్శనం దొరకడంలేదు. అయితే వంద సంవత్సరాల తరబడి తెలుగువారు ఇక్కడ నివాసం చేస్తున్నట్లు తెలుస్తున్నది. ముందుగా నాయుడు జాతికి చెందినవారు ఇక్కడకు వచ్చారు. వారిలో కొంతమందికి ఇక్కడ స్థిరచరాస్తులున్నాయి. వీరు చాలా కాలంగా వుంటూ వుండడం వలన స్థానిక రాజకీయాల్లోకూడా భాగం పంచుకుంటున్నారు. తెలుగు ప్రాంతానికి తెలుగు సంస్కృతికి దూరమైన కారణంగా తెలుగు భాషను వీరు చాలామట్టుకు విమర్శించారనే చెప్పవచ్చును. అయితే మాతృభాషను మరచిపోయినా కొన్ని పొడి ముక్కలను హిందీతోపాటు వాడుతూనే వుంటారు. అమ్మ, నాన్నా, అత్తా, తాతా, చారు, అన్నం, పచ్చడి వాటికి ఉదాహరణలు. వీరిలో వృద్ధులు యిప్పటికి ఇంటిలో తెలుగే మాట్లాడుతారు. పిల్లలు అర్థం చేసుకోగలిగినా తిరిగి జవాబు తెలుగులో చెప్పే స్థితిలో లేరు.

మధ్య ప్రదేశ్ హైకోర్టు, గన్ కేరేజీ ఫాక్టరీ, ఆర్డినెన్సు ఫాక్టరీ, డిపో, మిలటరీ ఆఫీసులు, ఇంకా ఎన్నో కేంద్ర ప్రభుత్వపు కార్యాలయాలు, బేంకులు ఉన్నాయి ఇక్కడ. వీటిలోనూ తదితర ప్రాంతీయ ప్రభుత్వ కార్యాలయాలలోనూ చాలా మంది తెలుగువారు పనిచేస్తున్నారు. అయితే వీరు ఇతరత్రా బదిలీలమీద వెళ్ళిపోవడం - కొత్తవారు రావడం జరుగుతూ వుంటుంది. గత అరవై సంవత్సరాలనుంచి ఇక్కడే స్థిరంగా నివసిస్తున్న ఉద్యోగులు వారి కుటుంబాలూ కూడా వున్నాయి. ఒక విధంగా వారు ఇక్కడ స్థిరపడినట్లే లెఖ్ఖ. ఉద్యోగరీత్యా తెలుగు దేశంనుంచి వచ్చిన వీరు తెలుగు భాష మరచిపోవడం అనే ప్రసక్తిరాదు. ఇలా ప్రభుత్వ రంగంలోనూ, ప్రయివేటు రంగాలలోనూ, కార్యాలయాలలోనూ పనిచేస్తున్నవారు వారి కుటుంబ సభ్యులు కలసి రమారమి నాలుగు వేలమంది తెలుగు వారున్నారు.

వీరుకాక జబల్పూరులో చెప్పుకోవలసిన మరో వర్గం తెలుగువారున్నారు. వీరి పూర్వులెప్పుడో భారతదేశంనుంచి బర్మాకు వలస పోయినవారు. రెండవ ప్రపంచయుద్ధ సమయంలో ఆ దేశం వదలి స్వదేశం వచ్చివేస్తూ, స్వగ్రామాలు వెళ్ళక ఇక్కడకు వచ్చారు. కట్టుబట్టలతో స్వదేశం రావలసిన పరిస్థితి; పూవులనమ్మినచోట కట్టెలమ్ముకోవడం నామోషిగా భావించి, ఉదర పోషణకు ఏ గ్రామ మైతేనేం, ఏ నగర మైతేనేం అని జబల్పూరులో స్థిరపడిపోయారు. అలాంటి కుటుంబాలు నాలుగు వందల పైచిలుకు వున్నాయి. వీరిలో బలిజలు, కమ్మవారు, ముస్లింలు, క్రైస్తవులు వున్నారు. వీరానాడు ఎంతటి నికృష్ట పరిస్థితుల్లో రావలసి వచ్చిందో, వారు చేపట్టిన వృత్తి తెలియజెప్తుంది. ఉదరపోషణకోసం జబల్పూరు నగరం మునిసిపాలిటిలో పారిశుధ్య విభాగంలో రోడ్లు ఊడ్చే పనిని చేపట్టారు.

కులవృత్తి కాకున్నా వారు ఆ పని చేపట్టారంటే ఎంతటి దీన స్థితిలో వచ్చారో ఊహకందనిది కాదు. బర్మాలో ఒకనాడు దర్జాగా బ్రతికినవారు.

జబల్పూరు చాలా విశాలమైన నగరం. 1971 జనాభా లెఖ్ఖలబట్టి ఏడున్నర లక్షల జనాభాగల నగరం. వైశాల్యం 116 చదరపు కిలో మీటర్లు. ఒక చివరనుంచి మరొక చివరకు వెళ్ళాలంటే కొండొకచోట 20 కిలోమీటర్లైనా ప్రయాణం చేయవలసి వుంటుంది. పురాతన నగరం కావడంవలన రవాణా సౌకర్యాలు పరిమితం. అయితే రాంజీతాల్ క్షేత్రంలో ఈ కాందిశీకులకు చెందిన తెగవారు నివసిస్తున్నారు. వీరివే సుమారు అయిదు వందల గడపలున్నాయి. ఆ క్షేత్రంలో తెలుగు వారు కానివారు లేరు. పిల్లా పాపా ముసలీ ముతకా అందరూ స్పష్టమైన తెలుగే మాట్లాడుతారు. ఆ ప్రాంతంలో అడుగు పెడితే దారితప్పి తెలుగు దేశంలోని ఒక కుగ్రామం చేరు కున్నామా అన్న భ్రాంతి కలుగుతుంది. ఇదొక విశిష్టమైన స్థితి. ఆనందం కలిగించే విషయం. వీరికి మాతృభాషమీద ఎడతెగని అభిమానం. దానిని నిర్వచించలేము. వారు తమ పిల్లలకు తెలుగు నేర్పాలన్న భావంతో పాఠశాలలో తెలుగు బోధించే ఏర్పాటు చేసుకున్నారు. తెలుగు సినీమాలన్నా, తెలుగు కార్య క్రమాలన్నా వీరికి వల్లమాలిన అభిమానం. వీరి సామాజిక స్థితిలో ఇప్పుడు చెప్పుకోదగిన మార్పు ప్రతి లక్ష్యమౌతున్నది. తల్లిదండ్రులు రోడ్లుతుడిచే పనిచేస్తున్నా పిల్లల అభివృద్ధి విష యంలో అశ్రద్ధ చేయలేదు. ఉన్నత విద్య, సాంకేతిక విద్యలు నేర్పించారు. ఇప్పుడీ కుటుంబాలలోని కొందరు యువకులు మంచి ఉద్యోగాలు చేస్తున్నారు. వీరి జనసంఖ్య రమారమి రెండువేలకు పైనే ఉంది.

తక్కిన తెలుగువారు చెదురుమదురుగా ఉన్నారు. పాతిక కుటుంబాలు ఎక్కడ ఒక ప్రాంతంలో లేరు. ఈనాడు తెలుగు వారు లేని కార్యాలయంకాని కార్ఖానాకాని జబల్పూరులో లేవు. డాక్టర్లున్నారు, నర్సులున్నారు. ఉపాధ్యాయులున్నారు, లెక్చ రర్లున్నారు. అధికారులున్నారు - గుమస్తాలు ఉన్నారు, ఇంట్రోతులున్నారు. రాజకీయాల్లో పలుకుబడి కలవారే కాక నగర రాజకీయాల్లో మంచి పదవుల్లో ఆసీనులైనవారున్నారు. కార్మికసంఘ నాయకులున్నారు. విద్యార్థులున్నారు. ఒక్క మాటలో చెప్పాలంటే తెలుగువారులేని రంగం లేదు. అయితే వ్యాపార రంగంలో ఉన్నవారు లేరనే చెప్పాలి.

స్థానిక తెలుగు వారిలో భాషాభిమానం, తమ సంస్కృతి పట్ల అభిరుచి మెండుగా వున్నాయి. వాటిని ప్రోత్సహించే సాధనాలు మాత్రం బహు తక్కువ. చాలా కాలంగా వీరు సాంస్కృతిక రంగంలో ఇతర భాషలవారి మాదిరిగా ఇతోధి కంగా సేవచేసి తమ జాతి గౌరవాన్ని స్థానికులకు తెల్పాలని తహతహ లాడుతున్నారు. 1956 వరకు అంటే భాషా రాష్ట్రాల ఏర్పాటు జరిగేవరకు ఈ దిశలో ఎట్టి ప్రగతి సాధించిన ప్రమా ణాలు కల్పించడంలేదు. 1957 పరిసరాలలో ఆంధ్ర సమాజ స్థాపన జరిగినట్లు తెలుస్తున్నది. పట్టుదలతో పనిచేసిన వారిలో కొందరి అకాలమృత్యువు, మరికొందరి బదిలీల వలన ఈ సంస్థ ఎంతోకాలం పనిచేయలేదు. ఆ తరువాత స్థానిక దక్షిణ భార తీయులు కొందరు కలసి దక్షిణ భారతీయ సంఘం అను పేరుతో ఒక సంస్థను స్థాపించారు. ఇందులో తెలుగువారు ముఖ్యభూమికను తీసుకున్నారు. తెలుగు వారిలో ఐకమత్యం కొరవడిన కారణంగా, సంస్థపట్ల చిన్నచూపు వలనా ఆ దక్షిణ భారతీయ సంఘం ఇప్పుడు తమిళుల హస్తగతమైంది. తెలుగు వారి పలుకుబడితో సంపాదించిన స్థలం, దానిమీద నిర్మించిన భవనం తెలుగువారికి దూరమయ్యాయి. ఆ తరువాత ఔత్సా హికులు ముందుకు రావడం ఒక సంఘాన్ని స్థాపించడం, అనివార్య కారణాలవలన లేదా స్వల్ప విబేధాలవలన ఆ సంస్థలు పురిటిలోనే సంధి కొట్టేయడం జరుగుతూ వచ్చాయి. ఆ కోవ లోకే ఆంధ్ర సంఘం, ఆంధ్ర గ్రంథాలయం, తెలుగు నాటక సమితి, ఆంధ్రా అసోసియేషను మొదలైనవి వస్తాయి. వీటిలో ఏ ఒక్క సంస్థ పట్టుమని నాలుగేళ్ళు పనిచేయలేక పోయింది. ఈ విధంగా ఆంధ్రులది ఆరంభ శూరత్వం అన్న నానుడిని వీరు యధార్థం చేశారు.

తిరిగి ఆంధ్రాభిమానంతో 1972 లో కొందరు ముందుకు వచ్చారు. ఆంధ్ర సంఘం అను పేరుతో ఒక సంస్థను స్థాపిం చారు. ఆనాటినుంచి పురిటి దోషాలను, బాలారిష్టాలను దాటు కుంటూ నేడు ఎనిమిది సంవత్సరాల ప్రాయానికొచ్చింది. ఒక పటిష్టమైన రాజ్యాంగాన్ని రూపొందించడమేకాక దానిని 1973 లోనే రిజిష్టరు చేయించారు. సంఘం ఈ కాలంలో బాగానే పురోభివృద్ధిని గాంచింది. అనుకోని అభివృద్ధిని గాంచింది. 2-8-1978 లో ఆంధ్ర సంఘ భవనంకోసం ఒక స్థలాన్ని కొనగలిగింది. ఈనాడు ఆ స్థలంలో ఒక భవనం కట్టాలన్న ప్రయత్నాలు చేస్తున్నది. కార్పోరేషను భవనం కట్టుకునేందుకు అనుమతి పత్రాన్ని జనవరి 81 లో ఇచ్చింది. 1981 ఉగాదికి శంఖుస్థాపన చేసి నిర్మాణ కార్యం ప్రారంభించాలన్న లక్ష్యాన్ని నిర్ణయించుకుంది కార్యవర్గం.

ఆంధ్ర సంఘం ఈ ఎనిమిది సంవత్సరాలలోనూ ఎన్నో సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించింది. తెలుగువారి పండుగలైన సంక్రాంతి ఉగాదులకు ఏటేటా ఏవో కార్య క్రమాలను ఏర్పాట్లు చేస్తున్నది. హరికథలు, బుర్రకథలు వీలున్నప్పుడు ఏర్పాట్లు చేస్తున్నారు. శ్రీ వేణుమాధవ్‌గారి మిమిక్రీ, శ్రీ కోరాడ్ నరసింహారావుగారి బృందంచే కూచిపూడి నృత్య ప్రదర్శనా ముఖ్యంగా చెప్పుకోదగినవి. ఆంధ్ర ప్రదేశ్‌లో జరిగిన తుఫాను బాధితుల సహాయార్థం ఈ సంఘం స్థానికంగా రూ. 10,000 కు పైగా విరాళాలు సేకరించి ముఖ్యమంత్రి తుఫాను బాధితుల నిధికి అంతర్జాతీయ తెలుగు సంస్థద్వారా పంపినది.

తెలుగువారికి నాటకాలమీద వ్యామోహం అధికం. ఈ రంగంలో కూడా స్థానిక ఆంధ్రులు ఎవరికీ తీసిపోరు. ఇక్కడ ఎన్నో రసవత్తరమైన ప్రదర్శనలు ఇస్తున్నారు. అంతేకాక స్థానికంగా జరిగే అఖిల భారతీయ నాటక నాటికల పోటీలలో పాల్గొని, పాల్గొనినప్పుడల్లా ప్రథమ బహుమతిని పొందుతున్నారు. ప్రథమ బహుమతితోపాటు కొందరికి ప్రత్యేక బహుమతులు, ఉత్తమ ప్రదర్శన బహుమతులు గెలుచు కుంటున్నారు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1976 లో ఈ సంఘానికి స్థలం కొనుగోలు నిమిత్తం అయిదువేలు విరాళం ఇచ్చింది. ఈ సంస్థ ప్రగతికి ఇదొక మైలురాయి. సంస్థ భవన నిర్మాణానికి కూడా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం భారీగానే గ్రాంట్-ఇన్-ఎయిడ్ ఇస్తుందని స్థానిక ఆంధ్రులు ఎదురు చూస్తున్నారు.

ఆంధ్ర సంఘం ఒక గ్రంథాలయాన్ని నడుపుతున్నది. వేయికి పైగానే తెలుగు పుస్తకాలు ఈ గ్రంథాలయంలో ఉన్నాయి. స్వంత భవనంలేని కారణంగా ఈ గ్రంథాలయ నిర్వహణ కొంచెం దుష్కరంగానే వుంది. పైగా ఇంతటి సువిశాల నగరంలో చెదురు మదురుగాఉన్న తెలుగువారికి గ్రంథాలయ సౌకర్యం కల్పించడం ఎంతో వ్యయప్రయాసలతో కూడినది. అయినా ఈ గ్రంథాలయం దినదిన ప్రవర్థమానం గాంచుచున్నది.

జబల్పూరులో తెలుగు ఒక విషయంగా చెప్పే పాఠశాలలు లేవు. అందువలన తెలుగు బాలబాలికలు తెలుగు మాట్లాడగలిగినా, వ్రాయడం చదవడంలో వెనకపడిపోయారనే చెప్పవచ్చును. ఆ లోటును భర్తీ చేయడానికిగాను స్వంత భవనం తయారైన వెంటనే ఢిల్లీ మాదిరిగా ఒక పాఠశాలను స్థాపించాలని ప్రయత్నాలు జరుగుతున్నాయి.

స్థానిక కళాశాలలలోనూ, విశ్వవిద్యాలయాలలోను కొన్ని సంవత్సరాల క్రితంవరకు తెలుగు వారికి (బయట నుంచి వచ్చిన) సీట్లు సుళువుగానే లభ్యమయ్యేవి. అయితే నిబంధనలను పటిష్టం చేసిన కారణంగా ఇప్పుడు తెలుగువారికి యిక్కడ విద్యా సౌకర్యాలు పరిమితమయ్యాయి. అయినా కొన్నికొన్ని శాఖలలో తెలుగు విద్యార్థులు ఈనాడూ చదువు చున్నారు. కొందరు వ్యవసాయ విశ్వవిద్యాలయంలో కూడా వున్నారు. విశ్వవిద్యాలయం నిర్వహించే పరీక్షలో తెలుగువారు సర్వ ప్రథములుగా ఉత్తీర్ణులై స్వర్ణ పతకాలను గ్రహించడం అనుచానంగా వస్తున్నది. ఆ విధంగా తెలుగువారు ఒక కీర్తి మానాన్ని నెలకొల్పారు. గత సంవత్సరం తెలుగు వారిలో ముగ్గురికి స్వర్ణ పతకాలను విశ్వవిద్యాలయం ప్రసాదించింది. ఆంధ్ర సంఘం ఒక ప్రత్యేక సందర్భంలో వీరిని సత్కరించి వారికి రజత పతకాలను ఇచ్చింది. ఈ విధంగా ఆంధ్ర సంఘం కళలపట్లా, విద్యపట్లా సమానంగా ప్రోత్సాహాన్ని అందజేస్తున్నది.

ఆంధ్ర సంఘం ఆశించిన పురోభివృద్ధి గావించక పోవడానికి అనేక అవరోధాలున్నాయి. ఎనిమిది వేలు జనాభా వున్నా ఏనాడూ సభ్యుల సంఖ్య రెండు వందలకు దాటలేదు. అందువలన వనరుల కొరత వుండనేవుంది. కలకత్తా, ఢిల్లీ, బొంబాయివంటి ప్రాంతాలలో అభివృద్ధి పొంది బాగా నిలదొక్కుకున్న సంస్థలకు అందజేస్తున్న సంస్థలకు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఇస్తున్న సహాయం ఈ సంఘానికి దొరకక పోవడం విచారకరమైనది. ఇప్పుడు గంగాకావేరి మూలాన ఆంధ్రప్రదేశ్‌నుంచి నేరుగా రాకపోకలు సాగించగలిగిన అవకాశం వున్నా గత సంవత్సరాలలో సౌకర్యాలు లేని కారణంగా పేరెన్నికగన్న కళాకారులను రప్పించే అవకాశం వుండేదికాదు. జబల్పూరు సంస్కారధాని అయినా, జనాభా అత్యధికంగా వున్నా మంచి ప్రదర్శనలు ఏర్పాటు చేయడానికి అనువైన రంగస్థలం లేదు. ఉన్న రంగస్థలంలో కావలసిన అన్ని సదుపాయాలు ఉన్నా, ప్రేక్షకులు పరిమితంగానే పడతారు. విశాలమైన ఆడిటోరియం లేని కొరత అందరికి వున్నా యింతవరకు మరో మంచి ఆడిటోరియం నిర్మాణం జరగలేదు. రాకపోకల సౌకర్యాలు లేకపోవడం కూడా సంస్థ పురోభివృద్ధికి ఆటంకం కలుగజేస్తున్నది.

ఏమైనా ఈ సంస్థ రాగల సంవత్సరాలలో మరింత పురోభివృద్ధి గాంచగలదని మేం ఆశిస్తున్నాం. *

# TELUGUS IN TAMIL NADU

K. R. VELAYUTHA RAJA

THE Telugus in Tamil Nadu have been living from remote times with a hoary history. Next only to Andhra Pradesh, the largest number of Telugus have settled down in Tamil Nadu. The Telugus of all castes are to be found in every village, town, districts, including the City of Madras. They number about 7 millions. Though agriculture is their main occupation, the Telugus are engaged in commerce, trade and industry and have made a mark. In Coimbatore and Rajapalayam, they have set up textile mills, screw factory, cement factory and other business enterprises. Among the Telugus of Tamil Nadu are educationist, men of letters, film producers, ex-zamindars, lawyers. judges and doctors. In many other spheres, they have distinguished themselves,

In state-level politics the Telugus have done well. In the past they have held high offices as those of chief minister and Governor. At present they make sizable representation in State Legislature and the Parliment. The present Vice Chancellor of the Madras University is a Telugu.

The Telugus in Tamil Nadu- such as Brahmins, Rajus, Vaisyas. Naidus, Reddiars and others speak Telugu at home. But the language differs from community to community, a mixed language dominated over by Tamil. Still the special cultural heritage, the distinctive characteristics of the ways of the Telugus in their dress, manners and customs are quite unmistakable. The Telugus in Tamil Nadu celebrate *YUGADI* with great enthusism.

The Telugu students have little or no opportunity of studying in the mother tongue except in Madras City. The schools where Telugu is taught as a second language can be counted on one's fingers in such places as Vellore, Madurai, Koilpatti, Hosur, Rajapalayam, Tirunelveli etc. Arrangements are quite inadequate for education in the mother tongue for the Telugus, though their numbers are considerable.

The Telugus are to be found in all parts of Tamil Nadu. but the problems facing them are peculiar, unlike those of their brethren in other parts of india and of the world, a fact to which I wish to draw the attention of the International Institute. I propose the following steps for the good of the Telugu Community.

The Telugus should urge upon the State Government to ensure the appointment of Telugu teachers in Primary, Middle and High Schools for teaching in the mother tongue. Adult Education should be provided for recourse being had to Tamil script for teaching Telugu. Telugu Libraries in the District Headquarters and towns with considerable Telugu population may be started.

Following in the footsteps of Sadhu Varadarajam Pandalu Sri P. S. Kumaraswamy Raja and others, the Dakshinandhra Bhasha Samithi is doing commendable work under the inspiring quidance of Mudunuri Jegannatha Raja. the multilingual scholar. The Samithi is engaged in the dissemination of Telugu Culture. It aims at the

teaching of Telugu to boys and girls so that they are able to read and write in Telugu. Towards this end and also to promote National Integration, it is bringing out pamphlets and leaflets, Telugu Text Books, holding meetings and is in other ways trying to consolidate the Telugus. Recently a book for learning Telugu through Tamil has been published. The Samithi is doing invaluable work in the way of cultural exchange between Tamil and Telugu. The Tamil Translation of Sri P. V. Rajamannar's Novel has been serialised in a Tamil Journal. Seshendr Sarma's 'My Country My people' will shortly go into print. The 'New Poems' of Sri K. S. Balaraman have been rendered in Telugu and brought out thanks to Sri K. R. Velayutha Raja, the Secretary of the Samithi. The anthology of Prose, Poems in Tamil and Telugu, short stories, novels and essays on culture and history in the two languages constitute a fruitful field for influencing each other and the cultural enrichment of both.

The songs of Vemana, Sumathi Sathakam, selected songs from Baratha Bagavatha are proposed to be transliterated into Tamil for the benifit of students.

For the building up of the Telugu language and Culture, the following suggestions are put forward. The Telugu Culture Associations functioning separately should integrated at the State level. A monthly magazine for Telugu should be broughtout.T he staging of Telugu Dramas with local financial support, Harikatha Programmes, arrangements for getting dailies, books, screening Telugu films, holding of Bharata Natyam, Music concerts and literary talks - all thse the cultural association will sponsor.

After the First World Telugu Conference in Hyderabad in 1975 there has been a new awakening among the Telugus of Tamil Nadu. The work of the International Telugu Institute for the promotion of Telugu Language and Culture is worthy of praisa. It is helping in conducting cultural progammes extending monetary and to the publication of books, towards building construction, making available Telugu Magazines for students over-seas and in other States of India and providing seats in colleges and universities of Andhra Pradesh for Telugus of other states. As a result the Telugu Language and cultur have forged ahead.

Let us hope and wish that the Second World Telugu Conference Opening in Kaula Lumpur will prove a success and promote the well-being of the Telugus throughout the world.

**

# TELUGUS IN THE STATE OF MADHYA PRADESH

V. S. RAMA RAO.

IN Madhya Pradesh, there are about two lakhs of Telugus. They mostly live in Bastar, Raipur, Bhilai, Bilaspur, Jabalpur, Bhopal, Indore, and Gwalior. Telugus are organised in these places under different manner of Telugu Associations. A fraction of Andhras have chosen Madhya Pradesh as their dweling, particularly in Bastar and Raipur as they happen to be the border areas of Andhra Pradesh. Most of the Telugus who migrated (due to Rajakar movement of Nizam State), settled there and became part and parcel of Madhya Pradeshians.

Telugu people in Madhya Pradesh mostly come over here on Government jobs, or trade and for education. In Chatishghat area of M. P. Telugus actively participated in agriculture, business like rice mills, Bidi industry. Many Telugus purchased agricultural land due to cheap availability of land in Madhya Pradesh and settled in farming. In this area, Telugus contributed even historically and politically. Some of the Telugu people became MLAs and Ministers and Diretors of the Co-operative Banks in the state of Madhya Pradesh. For example, Shri Kistaiah from Bastar was Tribal welfare Minister Shri Raman was MLA from Katni. Shri Ashoka Rao, presently is a MLA from Bilaspur and Shri V. S. Ramarao, is the director of citizens Urban co-operative bank Ltd. from Indore, and he is also the founder member of it as well as Nagrik Bank Ltd, Indore and many other institutions in Madhya Pradesh. Shri C. K. Naidu, was a great contributor in the field of Cricket in Madhya Pradesh and left Andhra legacy. In other places, Telugus come on CentralGovernment jobs, state government jobs and private companies, works.

Various Telugu Associations in Madhya Pradesh conduct Telugu evening classes in their Samiti premises for students who would like to learn Telugu. This facility is availed by Telugus as well as non-Telugus (Hindi people). Telugu Samitis provide Telugu weeklies, Novels, News papers to Telugu students either by circulation system or by libraries in the Samithi offices. And also they arrange to them Telugu essay, elecution competition to prove their ability in Telugu literature and some times even one Act Telugu plays are acted by them.

The activities of the Telugu Associations of Madhya Pradesh are varied from time to time, place to place and Samiti to Samiti. They arrange picnic trips so that Telugu people can come to-gether and develop intimacy of Teluguness. These Associations conduct annually sports and games among the members of Samiti. They run primary schools, Telugu libraries and arrange Telugu movies. The most important contribution of these Associations in the field of Telugu culture is to conduct the programmes of Bharata Natyam and Kuchipudi dances and issue a souvenir pertaining to Telugu culture and language, Indore Telugu Vignan Samiti arranged Kuchipudi Dance of Kumari Sobha Naidu in March 1974 and Bhilai Andhra Samiti constructed Lord Venkateshwar Temple in Bhilai in 1976.

There were historical and cultural ties between Andhra Pradesh and Madhya Pradesh being neighbours. Appreciation of Telugu culture and relations have been depicted through carvings at the famous temple of Gwalior fort. This is the only the Hindi) State (North India where we In Telugus can settle and mingle in various walks of life, And we can preserve our culture and language because to Madhya Pradesh is a cosmopolitan State with people, of different origins languages and cultures.

The only problems of Telugus in Madhya Pradesh is of their Sons and daughters marriages and their Telugu culture and heritage. Even through, Samitis are making an effort in these respects, it is not upto the mark.

We are making an effort to establish Madhya Pradesh Andhra Samaj on 5th April 1981 (Ugadi day). Under this, we Telugus of Madhya Pradesh of various Associations can spread the Jyoti of Telugu language and culture in North India, among Hindi people.

We are intending to extend our invitation to the Chairman of International Telugu Institute, Hyderabad, A. P. at the Second world Telugu conference at Malaysia on 15th April, 1981, personally, to hold the Third world Telugu Conference in Madhya Pradesh under the auspices of Madhya Pradesh Andhra Samaj.

"With aspiration to serve Telugu Talli".

# TELUGU ASSOCIATIONS IN OTHER STATES

*A BRIEF NOTE:*

LANGUAGE is a social product developed through constant social interaction and integration of a group of people and it forms the gate way of all the cultural expansion of a race. Every race, linguistic community attains a distinct cultural identity of its own, in the process of its expansion, both physical and intellectual. The Telugu People are proud of their unique identity or heritage evolved over centuries of creative experiments and achievements. A significant factor that contributed to this great cultural evolution is their adventurous migrations and maritime enterprises, started from the pre-Buddhistic period and successfuly continued till today. They have a specially appreciable feature of identifying with the people of other regions and races and a sincere commitment to participate constructively in the socio-economic development of the region they made their abode. But, delightingly they continue to cherish their legacy, language and culture and make concerted efforts to promote their heritage.

They have formed a number of literary and cultural associations in all the places they live and sown the seeds of fraternity and friendship among the fellow-members of the society, thus opening golden vistas of cultural integration, which needs a special sociological and analytical study. The paramount objective of all the associations is to cater to the socio- cultural and educ ational needs of their members and promote the image of their language and culture in a fraternal atmosphere. There are a few associations which are exclusively devoted to develop schools and colleges for Telugu children or platforms for the theatrical enthusiasts. Two or three Associations are also there engaged in serious academic and research activity with publication programme.

## IN SOUTHERN REGION

In southern parts of India, greater Telugu Cultural activity can be witnessed in Tamilnadu, as there are a number of native Telugus in the northern parts of the state, often forming as the majority of the area. The migration of the Telugu speaking people to t he southern parts started in the Greater Pallava period, and it continued in a larger scale during the post-Krishna Devaraya period, when the representatives of Vijayanagar declared independence and founded their own dynasties at Tanjavur and Madurai. They have patronised the literature and arts, over two centuries and several new art forms and genres flourished during their rule. In British India, the city of Madras became the most prominent cultural and trading centre for Telugu People. Even according to modest estimates, it is given to understand that there are over 50 lakhs of Telugu People living in the state of Tamilnadu today. Among them there are eminent educationists, men of letters, artists, leading industrialists, and agriculturists, They have distinguished themselves in the sphere of politics too, making a sizeable representation in the state legislature. Though the educational facilities in Telugu for children of Telugu origin are slightly better while compared to other states, they are undoubtedly inadequate inview of the large number of Telugu people in the interior parts. The Madras Presidency

College and the University of Madras, have post-graduate departments of Telugu which offer research courses. Besides, the Madurai Kamaraj University, Madurai, and the Annamalai University, Annamalai Nagar have facilities for advanced research studies in Telugu.

The capital City of the State, Madras, still retains the qualities of being one of the important cultural centres of Telugu speaking people. Several Prominent Telugu writers, publishers, artistes, cine directors and producers are living in the city and contributing their mite for the promotion of Telugu language and culture. Though the number is inadequate, several educational institutions are offering Telugu as either a subject or a medium, both at the secondry level and collegiate level. The Theagaraya Chetty Educational Trust in washerman pet, which runs a high school and a degree college, generally aknowledges to be one of the biggest city colleges, can rightly be called as a Telugu Institution, since its founder belonged to Telugu community, and even today it has a majority of Telugu people on its management committee. Similarly there are other sizeable number of Telugu associations devoted for the cause of Telugu learning, beginning from the primary level. Special mention must be made to the Adi Andhra Welfare Association and its associate bodies functioning in several parts of the city, who are evincing great interest in promoting the mother tongue study. Telugu as a subject in undergraduate level is available in about 12 colleges. At the post-graduate level, Telugu language and literature are taught in Presidency college, Madras, the oldest college in South. The college is associated with renowned scholars like Paravastu Chinnaya Suri, Kandukuri Veerasalingam, Vavilakolan Subba Rao, etc., who served on its faculty. It has research facilities also offering the M. Phil and Ph.D. degrees in Telugu by Madras University. The University of Madras has started in the last decade M. A., course in Telugu, besides the already available research courses.

Among the local Telugu associations, prominent are the Chennapuri Andhra Mahasabha, Andhra Mahila Sabha, Kala Sagar, Kala Bharati, Andhra Kala Samithi, Telugu Mahajana Samajam, C.V.R.D.E. Telugu Mitrulu, and the Telugu Patana Mandiram. Kala Sagar and Kala Bharati made a significant name in the field of cultural activity by their year round impressive Programmes. The Chennapuri Andhra Maha Sabha, situated in the heart of the city with a fullfledged auditorium is one of the oldest organisations in Madras. The Andhra Mahila Sabha actively associated with pioneering architects like Smt. Durga Bhai Deshmukh, is known for its yeoman services in creating a cultural awakening among the Andhra women during the pre-Independent times. The Telugu students of the city also have a place among the socio-cultural organisations, as there are two associations representing the students—1. The Madras Adi Andhra Students' Congress, and 2. The Chennapuri Andhra Vidyarthi Samithi besides a number of Telugu associations in the degree colleges where Telugu is taught. There are a few other bodies devoted exclusively for the instruction and popularisation of Kuchipudi, the famous Telugu school of classical dance.

In other centres of the state, notable are - Telugu Minority Federation, Lalgudi, Telugu Language Promoting Association, Chernmahadevi, Tirunelveli district; Telugu cultural Association, Ootakamand, Nilgiris Telugu literary Association, Annamalai University, Annamalai Nagar, Telugu cultural Association, Coimbatore, Telugu Bhasha Samiti, Timma Bhupalapuram, Chengalpet Dist., Yuvajana Seva Sangam, Vengampet, Kolathur, Chengalpet Dist., Dakshinandhra Bhasha Samiti, Koodalur, Tirnelveli Dist., and others. The Neyveli Telugu Samithi, founded by the Telugu members of the Neyveli LigetanCorporation is an active association with

library and theatrical facilities, progressing ahead with appealing programmes every year. A Telugu Pandita Parishad is started at Gudiyatham to further the interests of the Telugu teaching community in the state. The Telugu Vidyalayam of Rajapalayam in Tirnelveli Dist. and the Hosur Taluka Andhra Samskritika Samiti, Hosur in Dharmapuri Dist. need special mention among the Telugu organisations of the State. Rajapalayam is a town built by the Telugu Kshatria migrants during the reign of Madura Nayaka Kings, and it has a large number of Telugu population, settled particularly in agriculture. In the later half of the 17th century, talented poets flourished in around the place, authored several yakshaganas, padakavitas and vacanakavyas. The Telugu vidyalayam functioning with the main support of Sri Jagannatha Raju, has collected the manuscripts and published a few of them. Besides the regular teaching activity, the vidyalayam has also issued a few translations of Telugu works in Tamil and Telugu translations of Tamil literature. The Hosur Taluka Andhra Samskritika Samiti and Dakshinandhra Bhasha Rakshana Samajam, Hosur, which have grown in strength under the regular guidence of Sri K. S. Kothandaramaiah, a former legislator and Telugu scholar are devotedly working for the cultural reawakening of the Telugu people in the area and the contiguous parts of Karnataka. The Samiti conducts coaching for oriental titles in Telugu in affiliation with the Andhra Saraswatha Parishad, Hyderabad. It also organises classes in tailoring for women and runs a good library. The Samiti is acting as a cultural bridge between the Telugus in Tamilnadu and Karnataka.

Karnataka, is another state in South which has a sizeable chunk of native Telugu population. The contiguous districts of Bangalore rural, Kolar, Bellary, Chitradurga, Raichur and Gulbarga are thickly populated with Telugu speaking people. The builder of the present Bangalore city and the then Yalahanka king, Kempegouda, was a Telugu person by origin and it is learnt that he wrote an Yakshaganam in Telugu. The Mysore Kings patronised Telugu literature considerably well in the post-Krishnadevaraya period, and for instance, we have the rich prose literature developed during the same time. Bellary has been traditionally a Telugu cultural centre on the western point and there from we have the renowned names of Bellary Raghava and Dharmavaram Ramakrishnamacharyulu who contributed for the phenomenal development of Telugu stage. Till the advent of the linguistic states, there were good number of Telugu schools in the state, particularly in the contiguous parts, but slowly the number fell down to inadequacy. A few associations are striving to create better facilities in Telugu teaching, ideal among them is the Sarada Educational Society, Gangavati, Raichur Dt. The Andhra Kala Mandali, Hubli, predomintly a cultural association, also made significant efforts in expanding the educational facilities for Telugu learning children. The St. Peters High School, Hubli, has sizeable number of Telugu students on its rolls. In the city of Bangalore, to further the educational interests of Telugu public, the Andhra Education Society has been founded about a decade back, but it has yet to achieve a significant place, by fully implementing its objectives. The Municipal Corporation is running a few sections for Telugu children in the cosmopolitan city of Bangalore, and about a dozen colleges offer Telugu as a subject upto graduate level. The University of Bangalore has a department of Telugu offering post graduate and research courses in Telugu studies. The University of Mysore and the Karnataka University also created opportunities for research works in Telugu. The Southern Regional Language Centre in Mysore, imparts regular training to other South Indian language teaches in Telugu, and vice-versa. There are about 25 Telugu associations in Bangalore city, prominent among them being Telugu velugu, Telugu Mitrulu, Andhra Vignana Samithi, Andhra Saraswatha Vignana Sangham and Telugu Sahitya Samithi. The Telugu Scheduled Caste, Tribes, Backwards

and Minorities Welfare association is designed to be a state level body, promoting the all round welfare of the weaker sections belonging to Telugu community.

In other parts of the state, notable associations are the Telugu Samskritika Samiti, Mysore, Telugu Cultural and Dramatic association, Hubli, Raichur District, and the Raghava Memorial Association, Bellary, which is founded after the name of the doyen of Telugu stage Sri Bellary Raghava. The Andhra Vignana Samithi, Donimalai Township conducts annual competitions in short story writing among the college going students of Andhra Pradesh and Publishes an annual number with the award winning stories. Similar effort is also seen in the publications of Telugu Samithi, Mangalore. The annual issues of the two associations are worth preserving in any library, since they throw a good light on the psychological state of degree students. The Andhra Vignana Samithi is alo conducting non-formal classes for Telugu children.

In the southern states of India, comparatively smaller number of Telugus are found in Kerala, Though a sizeable number of Telugu Reddiars, Chettiars and Adi Andhras are found in the capital city, Trivandrum, with an altogether different dialect of Telugu, since their ancestors moved into the region centuries back. Prominent in cultural field are those who joined recently on employment with several Central and State Government Concerns. The students and faculty members in Regional Engineering College, Calicut have formed the Andhra Cultural Association in 1971 and are actively conducting different cultural and literary programmes. The annual number they release— Manjari, is certainly a note worthy publication, with stories, sketches and poems penned by its members, picturising the image of Telugu and the life of Telugu people in Kerala. The organisation also started a library on a modest scale, with reading room facility. Another Telugu Association in Calicut is the Arya Vysya Samajam, started in the last decade to attend to the social and cultural needs of its members of the community.

The Andhra Cultural Association in Cochin, started in 1973, is more active in conducting cultural activities. Its members include the Naval Officials in Cochin Port. It also runs a good library.

Though there are no facilities for teaching Telugu either at the school level or collegiate level in the State, the department of linguistics, University of Kerala introduced Telugu as a subject for post graduate students in linguistics. The department is mainly responsible for the inception of the International School of Dravidian Linguistics, where adequate facilities are available to carry research studies in Telugu language. The Dravidian Linguistics Association-D .L. A.-brought out two publications on Telugu language and sponsored conferences in Andhra Pradesh too. The Telugu Samskritika Sangham, in Trivandrum is also notable for the interest and enthusiasm it exhibits in conducting cultural activities.

* *

## IN EASTERN REGION

In eastern parts of India, Orissa occupies an important place as far as Telugus residence is concerned since some of the southern parts adjoining to Andhra Pradesh are thickly populated with Telugu people and till recently they were known as Telugu areas. Berhampur, virtually a Telugu town has a number of leading organisations devoted to promote the language and culture of Telugus. It is at this place, the first Rashtretarandhra Maha Sabha was convened in 1932, to awaken the Telugus outside the main region about their heritage and to initiate them for solving their socio-cultural and

educational problems. The oldest of the associations in Berhampur are the Andhra Bhashabhivardhini Samajam, and Andhra Mahila Samajam started in 1909 and 1906 respectively. Laudable are the efforts they made, they have a distinct place among all the Telugu associations in the country, in the sphere of social and cultural activities. Vikasam—a literary organisation recognised by the A. P. Sahitya Akademi is devoted for the promotion of Telugu literature. It organised recently an All India Telugu Writers meet in which several writers of renown participated and contributed for the success of the event. It has also a few publications to its credit. The Telugu Sahiti Samithi, in the Kallikota College, Berhampur, and Telugu Sahithya Samithi, in Vikramdeb College, Jeypore need special mention because of the enthusiasm of the students of the respective colleges to promote the literary activities in Telugu. The Kala Vedika, Andhra Vanita Mandali, Vidyaniketan Trust, Adarsa Sangham are some of the other Telugu associations in Berhampur. The Andhra Sanskritika Samajam and the Orissa Cultural Film Fans Association in Jharsiguda, and the Andhra Cultural Association in Bhubaneswar are also active organisations in the field of Telugu cultural activities.

With the advent of Hirakud dam on Mahanadi in 1956, a number of agriculturists migrated to Western Orrissa, encouraged by the invitation of Orissa Government, to take part in the cultivation programmes of the state. Thanks to the efforts of Rev. S. Limma, a Telugu Oria primary school was established in Talapatratikira, where there are about 30000 Telugu people. Recently the Kosala Andhra Cultural Association established an English Medium Residential School with the active guidance of Sri G. Ananda Rao, a leading agriculturist. The Government of Orissa is rendering suitable help and encouragement for the above Telugu schools



In eastern region another important State, with a number of Telugu people, is West Bengal. There are about fifty important Telugu associations in the State. Besides the metropolitan city of Calcutta, Telugus live in clusters in the districts of 24 paraganas, Hooghly, Howrah and Midnapur, mainly employed in the industrial sector. In Calcutta, the Andhra Association occupies a place of pride, with the association of prominent Telugus in the city. It runs a well established high school and owns a fairly equipped theatre. The Telugu persons employed in the South Eastern Railways are very active in holding several cultural functions. The Andhra Sangham and Andhra Cultural Association in S. E. Railway Colony are known for their sincere enthusiasm. The Andhra Sangham in particular has a gratifying record of service in cultural field. The Andhra Mahila Mandali has a sense of commitment to participate in the social work. It conducts classes in tailoring and classical music.

Kharagpur can as well be called a Telugu town since 50% of its population are of Telugu origin. The Andhra Youngmen's Association has an important place among all the Telugu associations. It has grown in strength with a long record of significant service in attending to the educational problems of Telugus in the place. It has a good library and runs a well established high school. Similarly, Pravasandhra Navya Kala Parishat is also an important organisation known for its theatrical activities. The Telugu Cultural Association in I. I. T., Rajak Samaj and Arundhati Yuvajana Sangham also need mention for their enthusiasm in catering to the social and cultural needs of local Telugus.

Titagarh in 24 paraganas district is a home of Telugu associations. Most of them are devoted to promote the educational and library facilities for local Telugus. Notable among them are the Titagarh Andhra Vidyalayam, Prathamika Siksha

